# తెలుఁగు కవులు

( REVISED EDITION )

గ్రంథకర్త:
మహావాది వేంకటరత్నం, బి. ఏ.

ప్రచురణకర్తలు:
సుందరరాం అండ్ సన్సు, తెనాలి.

కాపీరైటు రిజిష్టర్డు ] 1957 [ వెల: 0-14-0
[ 87 న. పై.

# వి ష య సూ చి క

# 1. వేములవాడ భీమకవి

పూర్వాంధ్రకవుల కాలము నిర్ణయించుటకు మనకుఁ దగిన యాధారములు లేవు. కావుననే కవుల కాలములం గూర్చి వాదోపవాదములు బయలు దేరుచున్నవి. వేములవాడ భీమకవి పూర్వాంధ్ర కవులలో బేరెన్నికఁ గన్నవాఁడు. ఈ మహాకవి యేకాలమువాఁడో యింతవరకును జక్కఁగాఁ దెలియదు. 1. కవి జీవితములోఁ బదునొకండవ శతాబ్దము లోనివాఁ డనియు, 2. ఆంధ్రకవుల చరిత్రలోఁ బదునాల్గవ శతాబ్దమువాఁడనియు, 3. విజనాశ్రయ పీఠికలోఁ బండ్రెండవ శతాబ్దము వాఁడనియు, 4. చాటుపద్య మణిమంజరిలోఁ బండ్రెండవ శతాబ్దప్రారంభమున నున్నవాఁడనియుఁ దెలుపం బడెను. ఇందేది నిక్కువమో నిర్ణయించుట కష్టము గావున నీవిషయము నింతటితో ముగింతము.

ఆడినమాటగాఁ బాడినదిపాటగాఁ జిరతరకీర్తి కాయం బుతో నిప్పటికిని గవిచరిత్ర సదనంబులఁ గాపురంబు సేయుచున్నవాఁడు వేములవాడ భీమకవి. ఈయన వేములవాడ యనునొక గ్రామంబున జన్మించెను. ఈ గ్రామము కృష్ణామండలములోని దని కొందరు, గోదావరీమండలములోని దని మరి కొందరుఁ జెప్పెదురు. కాని చరిత్రదృష్టాంతములంబట్టి యిది

1. గురజాడ శ్రీరామమూర్తిగారు
2. కందుకూరి వీరేశలింగముగారు
2. జయంతి రామయ్యగారు
4. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

కాకవాకేం౯ం కేసునా మున్నవని తెలుఁగువలన గోదావరి మండలములోనిదని చెప్పుచున్నారు.

దీనికి సమీపముననే భీమేశ్వరస్వామి వేంచేసియున్న ద్రాక్షారామమను పుణ్యక్షేత్రము గలదు. ఈస్వామి యనుగ్రహాతిశయమువలననే భీమకవి జన్మించెననియు నందుచేత నితఁడు స్వామికిఁ గుమారుఁడనియుఁ గొందరు చెప్పుదురు. భీమకవియుఁ దన్నుఁగూర్చి యొకచోట

"ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ ద్రాక్షారామభీమేశ నందనుఁడన్"

అని చెప్పుకొనుటచేత నిది నిజమేయని యూహింపనగుచున్నది.

ఈ మహాకవి జన్మప్రకారముఁగూర్చి యొక విచిత్ర కథ గలదు. వేములవాడలో నొక బ్రాహ్మణుఁడు గలఁడు. ఆయన వైదిక ధర్మనిరతుఁడు, ఋజుమార్గవర్తనుఁడు. మహా విభవ సమేతుఁడు. కాని యతనికి సంతానము లేదయ్యెను. సంతానముఁ బడయుటకై యావిప్రవరుఁ డెన్నెన్నో వ్రతము లాచరించి తుదకొక్క పుత్రికారత్నముం బడయఁగల్గెను. లేక లేక గల్గిన సంతానమగుటచేత భూసురుండా శిశువును గడుం గడు గారాబముతోఁ బెంచి పెద్దదానింజేసి యుక్తవయస్సున నొక విప్రకుమారుని కిచ్చి పెండ్లిగావించెను. కాని యా బాలామణి పుష్పవతి యగనప్పటికే యామె మగఁడు మృతినొందెను. పాపము! ఆ విప్రతనయ దుఃఖ మేమని చెప్పఁగలము? బ్రాహ్మణుఁడును దన సుతకైన వైధవ్యమునకు మిక్కిలి వగచి పుత్రికను బలుతెఱంగుల నోదార్చి యింటనే యుంచుకొని పోషించుచుండెను.

ఇట్లు కొంతకాలము గడచిన వెనుక నొకప్పుడు శివరాత్రి మహాత్మ్యమును దర్శించుటకై యాయూరంగల బ్రాహ్మణ స్త్రీ లెల్లరు ద్రాక్షారామమునకుం బోవుచుండిరి. అది గని యామెయుం దండ్రిని వేఁడ నతండును బోవ ననుజ్ఞ యిచ్చెను. అంత వారితో నరిగి యామె స్వామిని సందర్శించి తోడి వారందఱుఁ దనకుఁ గల యభీష్టంబులఁ బేర్కొని స్వామికి మ్రొక్కుచుండఁ దానును "ఓస్వామి! నాకు నీయట్టి పుత్త్రుఁ డుదయించెనేని సహస్ర ఘటాభిషేకంబు సేయింతు" నని మ్రొక్కెను. భక్తసులభుండగు శివుఁడు తన యభీష్టంబు నెఱవేర్చునని యామె యెంతమాత్రమును దలంపలేదు. ఊరకే యట్లు మ్రొక్కి యింటి కరిగిన తరువాత నాటిరాత్రి భీమేశ్వరుం డామెకు స్వప్నంబున సాక్షాత్కరించి 'బాలామణీ! నాయట్టి కుమారుని ననుగ్రహించుమని గోరితివి. కావున నేనందుకై యరుదెంచితిని. నాయనుగ్రహంబు కతంబున నీకుం గుమారుం డుదయింపఁ గలం' డని తెల్పెను.

పాపము! ఆ బ్రాహ్మణ పుత్త్రిక యిది యంతయు స్వప్న వృత్తాంతమేయని తలంచెను, గాని భీమేశ్వర ప్రసాదంబునఁ దనకుఁ గవిశ్రేష్ఠుఁడగు కుమారుం డుదయించునని తలంపదయ్యె. ఇట్లా విప్రకుమారి తన స్వప్న వృత్తాంతమును తల్లిదండ్రులకుఁ గాని మఱి యెవ్వరికిఁ గాని తెలుపకయున్న సమయంబున నెలదప్పి వేవిళ్లాకంభ మయ్యెను. అప్పటికిని దనకు గర్భమయ్యెనని యామె తలంపలేదు. మూఁడవనెల యగుసరికి గర్భలక్షణములు చక్కఁగా గానుపింప నాయూరంగల మహి

నను లెల్ల నెఱింగి అంకులాకీ యని యామెను నామెతలిదండ్రు లను వెలిపెట్టిరి. అందుకా బ్రాహ్మణుం డెంతయు ఖిన్నుఁడై తనయను జేరంబిలిచి 'అమ్మా! మనవంశము మొదటినుండియుఁ గీర్తి ప్రతిష్ఠలతో వాసికెక్కినది. కాని కులగౌరవము పాడగు చున్నది. కావున నిక్కము దాపక నాతో నున్న దున్నట్లు వచింపు' మని యడిగెను. అప్పుడామె కన్నీరు గార్చుచు 'నాయనా! నేనెట్టి దుష్కార్యములఁ జేసియుండను. ఇందుకు భీమేశ్వర స్వామి యనుగ్రహమే కారణ' మని తాను మ్రొక్కినవిధంబును శివుండు స్వప్నంబున సాక్షాత్కరించి తనకుం జెప్పినవిధంబును దండ్రి కెఱింగించెను. అతండును బుత్రిక జెప్పినదెల్లను నమ్మి లోకాపవాదమును సరకుఁ గొనక యథావిధిగా గర్భధారణ సంస్కారంబులు సేయించియుండు నంత నొక సుముహూర్తం బున నామెకుఁ బుత్రోదయం బయ్యెను. భీమేశ్వరస్వామి యనుగ్రహంబువలనం జేసి పుట్టిన కారణంబున నక్కుమారునకు భీమన యను నామకరణంబు సేయఁ బడెను. అక్కుమారుం డును శివానుగ్రహ సంజనితుండు గావున శుభలక్షణంబులతో నొప్పుచు దినదినాభివృద్ధి నొందు చుండెను.

అట్లుండ నొక్కనాఁడు బాలురతో డంగూడియాడుచుండ నందొక్క బాలుండు తండ్రి లేనివాఁడురా! యని మాటి మాటికి నతనిఁ బరిహాసింప సాగెను. అందు భీమన యెంతయు లజ్జించి రయంబునఁ దల్లికడకుఁజని తనతండ్రి యెవరో తెలుపవల సినదని యడిగెను. ఆమె యతనికి దొలుదొల్తఁ జెప్పక తుదకు భీమే శ్వరస్వామి యని చెప్పెను. చెప్పుటయే తడవుగా భీమన భీమే

శ్వరాలయంబునకుఁ జని స్వామిని సందర్శించి చేతులు గట్టు కొని 'స్వామీ! నన్నందఱుఁ దండ్రి లేనివాఁడని పరిహాసించు చున్నారు. నీవే నాతండ్రివని నాతల్లి చెప్పినది. నిజముగ నీవు నాతండ్రివో కావో చెప్పుము. చెప్పవేని యీ పాషాణంబుతో నీ తల పగులఁగొట్టి నేనును నీ పాదంబులకడ మరణించెద' నని యుగ్రంబుగాఁ బలుక భీమేశ్వరుఁడును నాతని చిత్తస్థైర్యంబు నకు మెచ్చి ప్రత్యక్షంబై 'బాలకా! నీవు నా కుమారుండ వగుట సత్యము. ఇందుకు నిదర్శనంబుగా నీవాడినది యాటగాఁ బాడినది పాటగా నీకు వరంబొసంగితిని. ఇంక నీ ప్రభావంబు నెల్లెడలం బ్రకటించి పేరుగాంచు' మని యనుగ్రహించి యదృశ్యుం డయ్యెను. భీమనయు మహోహ్లాదంబున గృహంబు నకుఁ జనుదెంచి జరిగినదంతయుఁ దల్లికిఁ దాతకు నెఱింగించెను.

భీమన యింతటి ప్రభావ సంపన్నుఁ డైనను నా యూరి బ్రాహ్మణు లతనిని గౌరవింపక చులకనగాఁ జూచుచుండిరి. ఇట్లుండ నొకనాఁడాయూర నొక విప్రునియింట బ్రాహ్మణ సమారాధన జరిగెను. అందులకు విప్రులందరు బిలువఁబడిరి. కాని భీమన మాత్రము రండా సుతుఁడని పిలువఁబడలేదు. ఇందుకు భీమన కోపించి సమారాధన చేయుచున్న బ్రాహ్మ ణుని యింటి వెలుపలి యరుగుమీఁదఁ గూర్చుండి లోపలఁ జరుగు చున్నదంతయుఁ దిలకించుచుండెను. ఇంతలో వడ్డన పూర్తి యయ్యెను. అప్పుడు భీమన తన మాహాత్మ్యముఁ జూపఁదలఁచి గృహములలోని వారందరు వినునట్లుగా,

అప్పాలన్నీ - కప్పలు గావలె
అన్నం అంతా - సున్నము గావలె

నని పాడెను. పాట ముగియుటప్పటికే వడ్డించిన యన్నమంతయు సున్న మయ్యెను. అప్పాలన్నియుఁ గప్పలయ్యెను. త్రుటి కాలములో నిల్లంతయుఁ గప్పలతో నిండిపోయెను. ఈ విచిత్ర మునకు విప్రులెల్లరు నాశ్చర్యపడి, పాట విన్నవారు గావున నిందుకు భీమనయే కారణం బని తలంచిరి. అంత గృహ యజమాని తన తప్పు నెఱింగి వాకిట నున్న భీమన్నను గౌరవ పూర్వకముగా లోనికిఁ గొనిపోయి సత్కరించెను. భీమనయు నతని సత్కార గౌరవాతిశయముల కెంతయు నలరి తిరిగి యందఱు వినునట్లుగా

కప్ప లన్నీ - అప్పాలగును
సున్న మంతా - అన్నంబగును

అని పాడెను. వెంటనే కప్పలన్నియు నప్పము లయ్యెను. సున్న మంతయు నన్నమయ్యెను. అప్పుడు విప్రులెల్లరు భీమనమహా ప్రభావ సంపన్నుఁడని చక్కఁగాఁ దెలిసికొని తమకంటె గొప్ప వానిగాఁ భావించి పూజించిరి. నాటితో భీమనకుటుంబమునకు వెలి తొలఁగెను.

ఇట్లు భీమన యొకరేని గౌరవంబును గడించి తన శక్తిని లోకమునకుఁ దెలుపనో యన దేశసంచార మొనర్పసాగెను. ఆ కాలమునఁ గల తెలుఁగు రాజులెల్లరు నతనిని విశేష గౌరవ దృష్టితోఁ దిలకించి సత్కరించిరి. ఆతఁడొకప్పుడు గుడిమెట్ట యను నొక చిన్న సంస్థానమున కరిగెను. ఆ సంస్థానాధీశుఁడు

మాగి పోతరాజు. ఇతఁడు భీమకవి మహాత్మ్యము నెఱుఁగక మూఢుఁడై యాతని గుఱ్ఱములఁ బందెపెట్టించె. భీముఁ డెంత వేఁడినను విడిపింపఁ డయ్యెను. అందుకు భీమకవి మిగులఁ గోపించి

చ. హయమది సీత పోతవసుధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ వహ్యజవార్ధి మరందుఁ డెన్న నా
ప్రియతనయుండు నచ్చన విభీషణుఁ డాగుడిసెట్టి లంక నా
జయమును బోతిరక్కసుని చావును నేడవనాఁడు చూడుఁడీ!

అని శపించెను. శాపప్రకారము మాగి పోతరాజేడవ నాఁటికే మృతినొందెను. అంతట రాజబంధువు లెల్లరు గూడి భీమకవి మాహాత్మ్యంబుఁ దెలిసికొన్నవారై యాతని కడకుఁ బోయి 'మహాత్మా! అజ్ఞానులము. అపరాధులము. మా యపరాధంబును మన్నించి మా రాజును బ్రతికింపుఁడు. మీయట్టి మహాత్ము లలిగినచో లోకంబులు నిలువఁ గలవా? యని పలు తెఱంగులఁ బ్రార్థింప భీమకవియు వారిని గరుణించి యా మృత కళేబరంబును డాయం జని

క. నాఁటి రఘురాము తమ్ముఁడు, పాటిగ సంజీవిచేత బ్రతికినభంగిన్
గాటికిఁ బోనీ కేటికి, లేటవఱపు పోతరాజు లెమ్మా లెమ్మా!

అని పలుక నిద్రనుండి లేచినట్లు పోతరాజు లేచి తన యెదుట నున్న భీమకవిం జూచి మ్రొక్కి తప్పు క్షమించుఁడని పెక్కు తెఱంగులఁ బ్రార్థించెను. భీమకవియు నతని కభయం బొసంగి 'రాజా! ఇదిమొదలెన్నఁడు కవుల ననాదరింపకుము. పెద్దలయెడ సద్బుద్ధి గలిగి ప్రవర్తింపుము. నీకు శుభంబయ్యెడుఁ గాక!' యని హితముపదేశించి యథేచ్ఛం జనియె.

ఒకప్పుడీ కవి పుంగవుండు విజయనగర సంస్థానాధీశుండైన కళింగగంగును జూడనేగి తన రాక నాతని కెఱింగించెను. కళింగగంగు మఱియొక కార్యావసరంబున నుండి ప్రస్తుతము తీఱిక లేదని వర్తమాన మంపెను. మఱికొన్ని దినములకు భీమకవి యరుదెంచి పూర్వ ప్రకారము తన రాక నెఱింగించెను అప్పుడును మఱియొకసారి వచ్చునది యని కళింగగంగు వర్తమాన మంపెను అందుకు భీమన కోపించి ఏమి యీతని గర్వము? నాకు నేనై యరుదెంచినను నన్నుఁ జూచుటకైన రాఁడాయెనే? కానిమ్ము. ఇతని గర్వమెట్టిదో పరికించెదగాక! యని చింతించి యతనికి భయంబు కలుగునట్లు నొకపద్యమును వ్రాసి యతని కడకుం బంపెను. ఆ పద్యము ననాదరదృష్టితో నావలఁ బాఱవైచెను, ఇందుకు భీమకవి మిక్కిలి కనలి...

ఉ. వేములవాఁడ భీమకవి వేగమె చూచి కళింగగంగు దా
సాహసము మాని కోపమున సందడి దీఱిన రమ్ము పొమ్మనెన్
మోమునుజూడ దోసమిఁక ముప్పదిరెండు దినంబు లావలం
జామును కర్థంచుం దతని సంపద శత్రులపాలుఁ గావుతన్.

అని కఠినముగాఁ శపించెను. అప్పటికిఁ గళింగగంగు గర్వము మానక పిల్లిశాపమున కుట్టి తెగునా? యను భావముతో నిర్లక్ష్యముగా నుండెను. కాని శాపప్రకారము గడువు నాటికే కళింగగంగు శత్రులచే నోడింపఁబడి రాజ్య భ్రష్టుఁడయ్యెను. పాపము ఇప్పు డతండు కూటికిం గూడ లేనివాఁడై ప్రచ్ఛన్న వేషముతో నూరూరఁ దిరుగుచు బిచ్చమెత్తుకొని పొట్టనింపుకొనుచుండెను. ఇట్లు దిరుగుచు నొక

ప్పుడు వేములవాడ కరుదెంచి యతఁడు భీమకవి యిల్లని యెఱుంగక రాత్రికాలమున బిచ్చమునకై యరిగి చీకటి గావున నాయింటి ముంగిటనున్న గోతిలోఁబడి "అహా! అతులిత రాజ్యభోగంబుల ననుభవించిన నాకీనాటికి గాలి దిటిటీయైన లేకపోయెఁగదా" యని పలవించెను. అదేసమయమున భీమకవి పాదప్రక్షాళనమునకై బయటికివచ్చి యా మాటలు విని 'ఎవరువా'రని ప్రశ్నించెను. అందుకు బదులుగా నతఁడు 'భీమకవిగారిచే జేయఁబడిన జోగి' నని చెప్ప భీమనయు, 'నీవు కళింగగంగువా!' యని తిరిగి ప్రశ్నించెను. అప్పుడు కళింగగంగ తడే భీమకవియని గుర్తించి 'మహాత్మా! మహాపరాధిని గరుణింపు' డని ప్రార్థించెను. అంత భీమన యతనికి బ్రసన్నుఁడై,

వేయి గజములతోను బదివేల తురంగములతోను రాయలగెల్చి సజ్జననగరమునఁ బట్టము గట్టుకొనుమని యాశీర్వదించెను. అదేరీతిగ రాజకళింగగంగు సైన్యంబులఁ గూర్చుకొని శత్రువుల దాకి మహాహవంబున నోడించి యెప్పటియట్లు రాజయ్యెను.

భీమకవి యప్పుడప్పుడు చోళ భూపతి యాస్థానంబున కరుగుచుండెడివాఁడు. అతండును భీమకవి నెంతో యాదరించుచుండెడివాఁడు. ఒకప్పుడీచోళ నృపాలుఁడు సాహిణిమారుఁడను దండనాథుని మీఁదికి దండెత్తిపోయెను. కాని యతని నోడింపఁజాలక దిగులుపడి యున్నయెడ నతనివెంటనేయున్న భీమకవి యతనికి జయంబు సేకూర్పఁ దలంచి,

సాహిణిమారుఁడు మారుఁడై పడఁగా
మిక్కిలి రాజశేఖరుని మీఁదికివచ్చిన రిత్తవోవునే?

అను పద్యము చదివెను. ఇది యొక శాపమై తగుల సాహిణిమారుండు యుద్ధములో మరణించెను. జయము చోళనృపతికి లభించెను. ఇట్లు జయమును గొని చోళభూపతి తిరిగి స్వస్థానంబున కరుదెంచి భీమకవితో వినోదించుచు నొక్కనాఁడు "మహాత్మా! మీ రాడినది యాటయుఁ బాడినది పాటయు నగుననియు, మీరు చేయలేని యద్భుత కార్యంబులు లేవనియుఁ జెప్ప వినుదును. అయినను మీ మహాత్మ్యం బెట్టిదో ప్రత్యక్షంబుగఁ జూచి యెఱుంగను. కావున నీమల్లె శాలనున్న స్తంభమును బహుళకుసుమఫల శోభితంబగు నొక్క మహావృక్షంబుగా నొనర్చి మాకానందము గూర్పుఁ" డని పలికెను. భీమనయుఁ జిఱునవ్వు మొగముతో నిదియెంత పని యని యచటి వారెల్లరుఁ జూచుచుండ, నా స్తంభ మాతని కవితామహిమచే బహుళకుసుమఫల శోభితం బగునొక మహావృక్షమయ్యెను. అందుకుఁ జోళనృపాలుఁడును, సభికులును మహావిస్మయహర్షనిమగ్నమానసు లయిరి. అంతఁ గొంతవడికి రాజు కవిని జూచి "కవిపుంగవా! మీ మాహాత్మ్యం బద్వితీయంబు. ఈ స్తంభము నెప్పటియట్లు గావించి మమ్ము గరుణింపుఁ" డని కోరెను. భీమనయు నట్లే యొనర్చెను.

ఈ మహాకవి మాహాత్మ్యముం గూర్చి తెలుపుగాథ లిట్టివి పెక్కులు కలవు. ఇవన్నియుఁ గల్పితము లనియు నిందు సత్యము లేదనియుఁ గొందఱు చెప్పుదురు. భగవదనుగ్రహము గలవారు, వాక్శుద్ధిగలవారు, వింతలగు కార్యములఁ జేయుట

మనము వినియేయున్నాముగదా! అదిగాక పూర్వకవులు భీరం ఋశాధికారులని చరిత్ర దృష్టాంతములంబట్టి రూఢియగుటవలన నీ గాథలు సత్యములేయని నమ్మనగుచున్నవి.

ఇతనిది శైవమతము. ఇతఁడు తిట్టు కవిత్వమునందే గాక కావ్యరచనయందును మిక్కిలి గొప్పవాఁడు. ఆంధ్రమునందు, కన్నడమునందు నితఁడు కవిత్వము చెప్పగలఁడు. నృసింహ పురాణము, కవిజనాశ్రియమను ఛందోగ్రంథము నితఁడు తెలుఁగులో రచించెను. పాల్కురికి సోమనాథుఁడు తెలుఁగులో రచించిన బసవపురాణము నీతఁడు కన్నడించెను.

ఉభయ భాషలయందును గ్రంథముల రచించి భీమన గొప్ప పేరుగాంచెను. ఈ మహాకవి మరణమునుగూర్చి యొక విచిత్రమైన కథ గలదు. ఒకప్డు ఊతనితల్లి యితనికి నన్నము బెట్టి నెయ్యి వడ్డించుచుండఁగా నాగిన్నెయొక్క మసి యామె పొట్ట కంటెను. అదిచూచి భీమన "అమ్మా! నీ కడుపు మసి యయ్యెనుఁగదా!" అని పలికెనఁట. కడుపు మసియయ్యె నను టతో సంతానముఁ గూర్చిన యశ్లీలార్థ ముండుటఁ బట్టియుఁ భీమకవి వాక్యము రిత్తవోనిదగుటంజేసియుఁ దోడనే యతఁడు మరణించెనఁట. ఈ వృత్తాంత మెంత వరకు సత్యమో నిర్ణ యింపఁ జాలము.

# 2. పిల్లలమఱ్ఱి పినవీరభద్రన

క. పిల్లలమఱ్ఱి పినవీరన - కిల్లాలఁట వాణి యట్టులే కాకున్నన్
జల్లఁగ నొక్కొకరాతిరి - తెల్లఁగ దెలవారు వరకుఁ దేఁగలఁడె కృతిన్?

అని యీకవింగూర్చి యొక్క చాటూక్తిఁ గలదు. వాణీరాణి యను బిరుదు వహించుటఁజేసి యీకవి సుప్రసిద్ధాంధ్రకవులలో నగ్రగణ్యుఁడని తెలియుచున్నది. ఇతఁడు విద్యానగరమును బరిపాలించిన సాళ్వకుల నరసింహరాజు కాలములోనివాఁడు. మఱియు నతని యాస్థానకవీశ్వరుఁడు. ఈ నరసింహరాజు మొట్టమొదట విద్యానగరమును బరిపాలించిన విరూపాక్ష రాయలయొద్ద సేనాధిపతిగానుండి యతని యనంతరము విద్యానగర సామ్రాజ్యము నాక్రమించి పరిపాలించినట్లు చరిత్ర దృష్టాంతములవల్లఁ దెలియుచున్నది. కాఁబట్టి తదాస్థాన కవీశ్వరుఁడైన పిల్లలమఱ్ఱి పినవీరభద్రసుకవియు పదునైదవ శతాబ్దినున్నట్లు తెలియుచున్నది. మఱియు నితఁడు కవిసార్వభౌముఁడైన శ్రీనాథుని చరమదశలయందున్నట్లతని చరిత్రవలనను దెలియుచున్నది.

ఈ మహాకవి యేమండలమువాఁడో చక్కఁగా దెలియదు. ఇతని తండ్రి గాదయామాత్యుఁడు. తల్లి నాగాంబ. వీరిది నియోగి బ్రాహ్మణశాఖ. గాదయమంత్రి పెద్దకాలంబు వఱకు ననపత్యుండై సంతానంబు వడయఁగోరి వీరభద్రు నారాధించెను. ఆదేవుని కృపాతిశయంబునం జేసి యితని కిద్దరు

సుతులుదయించిరి. అక్కుమారులకుఁ బెదవీరభద్రుఁడనియుఁ బినవీరభద్రుఁడనియు నామకరణము లొనర్పఁ బడెను. పెదవీరన తండ్రివలెనే నిరంతరము శివారాధనపరుఁడు. వెండియు, దండ్రియనంతర మతఁడమాత్యపదంబు నొందెను. వీరివంశము తరతరముల నుండియుఁ బండిత వంశ మని ప్రసిద్ధి కెక్కెను. కాని పినవీరన బాల్యమునుండియు విచ్చావిహారవర్తనము గలవాఁడు. తల్లిదండ్రులమాట లక్ష్యపెట్టక తన యన్నవోలె శ్రద్ధతోఁ జదువక తోడిబాలురనుగూడి యెల్లప్పుడు వీధులలో దిరుగుచుండెడివాఁడు. అయినను పినవీరన శుభలక్షణములం బట్టి యతఁడు పండితోత్తముఁ డగునని యెల్లరు దలంచెడివారు. పినవీరనకుఁ బదిరెండేండ్లు నిండునప్పటికిఁ జదువుకొనవలెనని యభిలాష గలిగెను. అప్పుడతని కక్షరాభ్యాసము చేయఁబడెను కాని మేధాశక్తి సంపన్నుఁడగుటంజేసి యచిరకాలముననే సర్వవిషయముల నభ్యసించెను. గురువులతని తెలివితేటల కాశ్చర్యపడి యితనిఁజూచి విరించి యవతారమని ముచ్చటించిరి. పినవీరనయు నంతటితోఁ దృప్తినొందక యా కాలములో సరస్వతీ యవతారమని సంభావింపఁబడుచున్న భారతీ తీర్థులయొద్ద కరిగి యతనికి శిష్యుఁడై గీర్వాణ విద్య నభ్యసింపఁ దొడఁగెను. భారతీ తీర్థులు శృంగేరిలోని జగద్గురు పరంపరలోనివాఁడు. యోగమార్గ ప్రవర్తకుఁడు, విద్యాశంకరుని ప్రథమశిష్యుఁడు. ఇతండును విద్యారణ్యులును గలిసి 'పంచదశప్రకరణము' అను గ్రంథమును రచించిరి. పిదప వీరన భారతీ తీర్థులకు శుశ్రూషలు సేయుచు నాయన

చెప్పుటయే తడవుగా వేదవేదాంతాది సకలశాస్త్రములఁ గ్రహించి యచిరకాలముననే యద్వితీయ పాండిత్యవిభవ సంపన్నుఁ డయ్యెను. భారతీ తీర్థులును చినవీరన మేధా విశేషంబులకు మెచ్చి యోగవిద్యను గూడ బోధించి సరస్వతీ మంత్రము నుపదేశించెను. తన్మంత్ర ప్రభావంబువలనఁ జినవీర నకు వాణీవశవర్తిని యయ్యెను. వెండియు నతనికి యోగవిద్య కరతలామలకమగునటుల జేసి యొకవిధమగు మహిమయు నతని యందు నిండుకొనెను

ఇట్లతఁడు విద్యాభ్యాసము పూర్తిగావించి స్వగృహంబునకు మరలివచ్చెను. చినవీరన యెంతటి పండితుఁడో యంతటిరసికుఁడు. ఇంటికివచ్చిన యచిరకాలములోనే యితఁడు వేశ్యాలోలుఁ డయ్యెను. తండ్రి యప్పటికే గతించుటఁ జేసి పెదవీరన కుటుంబాధికారి యయ్యెను. ఇతనికిమాత్రము తమ్ముని ప్రవర్తనము నచ్చలేదు. కాని పెదవీరనభార్య మఱఁది విషయమై యేమాత్రము నేవగించుకొనక యతని చర్యలన్నియు లీలావినోదములను బుద్ధిఁజేసి యేకొరంతయుఁ గలుగనీక చూచుచుండెను. చినవీరనయుఁ గుటుంబపోషణమును గూర్చి యొకప్పుడైన విచారింపక అన్నముఁ దినుటయే తడవుగా వేశ్యా గృహంబునకుఁ బోవుచు రేయింబవళ్ళనక యభీష్ట సుఖంబులం దవిలి కాలంబు పుచ్చుచుండెను.

ఒకనాటి ప్రాతఃకాలమునఁ జినవీరన యింటికరుదెంచి దంత ధావనము చేసికొనుచుండ నతనివదిన నీరుదెచ్చి యందిం

చెను. అపు డామె కాలిపావడములు ఘల్లుఘల్లుమని మ్రోయ దూరమున శివపూజ గావించుచున్న పెదవీరన యా ధ్వని విని "దీని కాళ్ళ కందెలు లేనందువలన యీ పావడంబులు మ్రోయుచున్నవి. అందెలు త్వరలోఁ జేయింపుట మంచిది. ఇందుకుఁ దగిన పనివాఁడెవఁడు?" అని యా యూరిఁ గల పనివాండ్రఁ గూర్చి యాలోచించుచుండెను. అదే సమయ మున నెవ్వఁడో యొక రాజసేవకుఁడు వచ్చి "పెదవీరనగా రింటిలో నున్నారా" యని యడిగెను. ఆ సమయమునఁ బెదవీరన్నయే పరాయత్తచిత్తుండై యుండుటంజేసి "ఇంటిలో లే"రని చెప్పెను. అపుడు పిన వీరన నవ్వుచు "ఓయీ! మా యన్నగారిప్పుడు భార్య కందెలుచేయించు తలఁపుతోఁ గంసాలిదుకాణములో నున్నారు. మరిఁ దమ్ము" అని చెప్పెను. ఆమాటలు విని పెదవీరన యాశ్చర్య చకితుఁడై "ఏమది? నా మనస్సులోని సంగతి వీఁడెట్లు గ్రహించె? నని దీర్ఘ ముగా నాలోచించి యిందుకుఁ దమ్ముని యోగవిద్యా మహి మయే కారణమని భావించెను. అది మొదలుకొని తమ్ముఁ డన్న మిక్కిలి యనురాగముతోను, మహాభక్తితోను, జూడ సాగెను.

తనకుంగల యోగవిద్యా ప్రభావంబు వలన బినవీరన యిట్టి యద్భుత కార్యము లెన్నియేనియుఁ జేయుటంజేసి యతని గొప్పతనము సర్వత్ర వ్యాపించెను. ఈ వృత్తాంత మెరింగి నరసింహ నృపతి యితనిఁ దన యాస్థానమునకు రప్పించుకొని సగౌరవంబుగఁ బూజించి పండితస్థాన మొసం

గెను. అది మొదలు పినవీరన విద్యానగర సంస్థానమున కవీశ్వరుం డయ్యెను.

నరసింహ భూపతికి భారతకథ యన్న మిక్కిలి యిష్టము. ధర్మరాజాశ్వమేధ వృత్తాంతమే కథావస్తువుగాఁ గలిగియున్న జైమిని భారతమును గృతినొందవలెనని యితని కెంతో యభిలాష గలదు. అట్టి యభిలాషతో నొక్కనాఁ డతండు తన యాస్థాన కవీశ్వరుల నెల్లర రావించి గౌరవించి "కవిపుంగవులారా! జైమిని భారతము నాంధ్రీకరించుటకు మీయం దెవ్వరో పూనుకొని ఎంత కాలము వలయునో యెఱింగింపుఁడు. మిక్కిలి స్వల్ప కాలములో ముగింపఁగల సమర్థుఁ డిందున్నచో ముందుకువచ్చి యీ తాంబూలమునుఁ గొనుఁగాక!" యని పలికెను. అందుకు కవులెల్లరు దీర్ఘముగ నాలోచించి యొక వత్సరము పట్టు ననిరి. వారిలో నొకడు లేచి తన కాఱునెలలు చాలుననెను. మఱొక్కఁడు నాలుగునెలలు చాలు ననెను. ఇంకొక్కఁడు మూఁడు నెలలు చాలుననెను. ఇట్లు చెప్పుటయే గాని 'నేను' అని ముందుకు వచ్చి తాంబూలముఁ గొన్నవాఁడొక్కఁడు లేడు. అప్పుడు పినవీరన లేచి, రాజా! నాకొక్కనెలమాత్రము చాలును. ఇంతకంటెఁ దక్కువ కాలములో ముగింపఁగలవా రిందున్నచో వారికే తాంబూలమిండు. లేకున్న నేఁ గైకొనెద' నని పలికెను. కవులెల్లరు నతని శక్తి నేకగ్రీవముగాఁ గొనియాడి తాంబూల మతనికే యిండని రాజునకుఁ జెప్పిరి. నరసింహనృపతియుఁ బినవీరన యడిగిన గడువునకుఁ గడుంగడు వింతపడి యతనిపల్కుల విశ్వసింపఁజాలక "అయ్యా!

తమరట్లు గడువులోపల ముగింపజాలనిచో" నని యడుగుట ముగియక మునుపే 'తలగొట్టుండని' పినవీరన ప్రత్యుత్తర మొసఁగెను. "ముగింపకున్న శిక్షదప్ప" దని రాజు మఱొక్క మాఱు నొక్కి వక్కాణింప వీరన్న నవ్వుచు నొక్క రాత్రియే చాలునని తాంబూలముం గొని గృహమున కరుదెంచి జరిగిన దెల్లఁ దనయన్న కెఱింగించెను. తమ్ముని ప్రతిన కతఁడు సంతసించెను గాని గడువులోన ముగింపఁ గలఁడో లేఁడో యని భయపడెను.

తరువాత నొక శుభ ముహూర్తమునఁ గృత్యాది జెప్పఁబడు మంగళశ్లోకంబులు మూఁడు నాలుఁగు రచించి యంతటితో గ్రంథము పూర్తియైనట్లు పినవీరన నిశ్చితుఁడై వారకాంతా వినోదంబులఁ దవిలి ప్రొద్దులు పుచ్చుచుండెను. దినములు గడచినకొలఁది గడువుకాలము సన్నగిల్లు చుండుటయు గ్రంథ మంతవఱకు మొదలు పెట్టకుండుటయుఁ జూచి పెదవీరన తమ్మునిమరణము నిశ్చయమని తలంచెను. పాపము! ఏమిచేయఁగలడు? గ్రంథరచనముఁ గూర్చి తమ్మునితో నెంత నొక్కి చెప్పినప్పటికి నతఁడు సరకుసేయక వేశ్యాభోగంబుల మునింగి యుండెను. తుదకు గడువు దినమే సమీపించెను. తెల్లవాఱిన దమ్ముఁడు మరణించునని పెదవీరన దుఃఖింప సాగెను. కాని పినవీరన మాత్రము సంతోషోత్సాహములతో నాదినమున వేశ్యాగృహంబునకుఁ బోక శుచియై సరస్వతీ మంత్రములను విధ్యుక్తప్రకారంబులఁ బఠించి గ్రంథరచనకు వలయు పరికరంబుల సమకూర్చి వదినయొద్దకుఁ బోయి నమస్క-

రించి "తల్లీ! నేఁడు నాగదిని జక్కఁగా నలంకరింపుము. నే నీరాత్రి యింటనే నిద్రింతు" నని చెప్పెను. ఆమెయు మఱఁది గొప్పతనము నెఱింగినది గనుక శయనమందిరమును సుందరముగా నలంకరించెను.

ఈ యాడంబరమును జూచి పెదవీరన తమ్ముఁడింటిలో నిద్రించునుగదా యని సంతసించెను గాని తమ్ముని జీవితమున కిదియే తుదిరాత్రియని మిగులదుఃఖపడెను. పినవీరన మోమున మాత్రము దుఃఖసూచకమయిన చిహ్నమొక్కటియును గానరాదు. మీఁదుమిక్కిలియాఁనాఁడతఁడెంతో యుత్సాహముతో నుండెను. ఇట్టియుత్సాహమునకుఁ గారణమెట్టిదో పెదవీరనకు బోధపడలేదు. ఆ రాత్రి భోజనములైన తరువాతఁ బినవీరన తలుపులు బిగించి తన శయనమందిరములోఁ బరుండెను. పెదవీరనయు నతనిభార్యయు నింటిలోఁ బరుండిరి. పినవీరన యప్పుడే గుఱకపెట్టి గాఢనిద్రలో మునింగెను. పెదవీరన మాత్రము దుఃఖాతిశయముచే నిద్రింపక మెలకువతోనుండెను. ఇంతలోఁ బినవీరనగదిలో నెవ్వరో శరవేగమున వ్రాయుచున్నట్లు గంటము యొక్క శబ్దము వినవయ్యెను. అప్పుడు పెదవీరన తమ్ముఁడే వ్రాయుచున్నాఁడని తలంచెనుగాని యొకవంక గుఱ్ఱుమని గుఱక ధ్వని మఱియొకవంక గరగరమను గంటము చప్పుడు వినఁబడుచుండుటచేత నేమియుఁ దోఁచనివాఁడయ్యెను. ఈ విధముగా గొంతకాల మతఁడు వేచియుండి యింక నూరకుండలేక లేచి గదిదగ్గఱకుఁ బోయి తలుపు సందుగుండ లోనికిఁ దొంగిచూచెను. ఆహా! ఏమని చెప్పుదును,

ఎవ్వరో యొక కాంత దివ్యవస్త్రాభరణ భూషితయై పినవీరన్న ప్రక్కఁ గూర్చుండి నాలుగుచేతులతోఁ గంటము నాపకుండ వ్రాయుచుండెను. ఈదృశ్యమును జూచి పెదవీరన్న కెవ్వాన కేక వైచెను. వెంటనే యాకాంత తనచేతిలోని గంటమును విసరివైచి యదృశ్య మయ్యెను. పాపము! ఆ గంటము వచ్చి పెదవీరన కంటిలోఁ గ్రుచ్చుకొనెను. అట్లామె యదృశ్యయైనంతనే 'దేవీ! ఈ మాత్రమునకే సిగ్గువడితివా?' యని పలుకుచుఁ బినవీరన దిగ్గున లేచి తలుపుఁ దెఱచిచూడ పెదవీరన కంటి బాధతో గ్రిందపడి యుండెను. అప్పుడతఁడన్నను జేరి "అన్నా బావనైన నిన్నుఁజూచినంతనే మఱదలు సిగ్గుపడి నిన్నిట్లు పరాభవించినది. దీనికింతగా వగచుటయేల?" యని వ్రాయుచున్నపుడు రాలిన తాటాకు పొడిదెచ్చి కంటికద్దెను. తోడనే పెదవీరనకుఁ గంటిబాధయుంతరించెను. అప్పుడతఁడు మహా హర్షముతో లేచి తమ్ముని గౌగలించుకొని 'తమ్ముడా! నీవింతవాఁడవని తెలిసికోలేక యెంత దుఃఖపడితిని? అయ్యో! నామూలముగా గ్రంథమింకను బూర్తిగాలేదు. తెల్లవారనున్నది. త్వరగ ముగింపు'మని చెప్పి స్నానార్థమై యరిగెను. పినవీరనయు గొఱవడియున్న భాగమును బెదవీరన్న స్నానము చేసివచ్చునంతలో ముగించి కృతకృత్యుండయ్యెను. తెల్లవాఱినది. కవులెల్లరు బినవీరన మరణము నిశ్చయమని విచారపడసాగిరి. సూర్యోదయ మైనంతనే నరసింహభూపతి గ్రంథముఁ గొనిరావలసినదని వర్తమాన మంపెను. అప్పుడన్నదమ్ము లిరువురుఁ బవిత్రవస్త్రముల ధరించి గ్రంథముగొని యాస్థాన

మున కరిగిరి. కవులతోను బండితులతోను మంత్రి సామంతాది సమస్తజనులతోను సభాభవనము క్రిక్కిరిసి యుండెను. అంత రాజానుమతిమీఁద బెదవీరన గ్రంథమును జదివెను. అందలి కవితా మాధుర్యమునకు రాజు మెచ్చి పినవీరనను జూచి "అయ్యా! నిన్నటివఱకు గ్రంథరచనారంభమే లేదని నా జనులు చెప్పిరి. ఒకరాత్రిలో నింతరసవంతముగా నింత పెద్ద గ్రంథము నెట్లువ్రాయఁ గల్గితివి?" యని ప్రశ్నింప బినవీరన నవ్వుచు "వాణి నా రాణియై యుండ నిట్టి గ్రంథము లొక లెక్కయా?" యని పలికెను. ఆ పలుకులకు భూపతి యులికిపడి కవులవంక జూచెను. కవులును బినవీరన మాటకు విస్మయ కోప పరీతచిత్తులై "అయ్యా! సకలవిద్యలకుఁ దల్లియైన వాగ్దేవి నిట్లు నిండుసభలో నవమానించుట నీయట్టి వానికిఁ దగదు. ఒక్కరాత్రిలో గ్రంథము పూర్తిచేయఁగల కవితాశక్తి నీకున్నను నిట్టి యహంకారము తగునా? అందఱికిఁ దల్లియైన సరస్వతి నీకుభార్యయయ్యెనా?" యని మందలించిరి. అప్పుడు పెదవీరన రాత్రి తాను బ్రత్యక్షముగా జూచినదెల్ల సభవారికిఁ జెప్పెను. కాని వారు నమ్మలేదు. మెండియు వాగ్దేవి నవమానించిన దోషమునకుఁ గాను పినవీరనను శిక్షించునదిగా రాజును గోరిరి. ఆసమయమున సింహాసనమునకు వెనుకనున్న తెరలో నెవ్వరో యొకకాంత కంకణములు మ్రోయ దక్షిణ హస్తమునెత్తి "రాజా! ఈ మహాత్ముడన్నమాట సత్యము. ఈయన విరించి యవతారము గనుకనే నీతనిరాణి"నని చెప్పి తిరోహితయయ్యెను. ఆవల్కులకుసభికులెల్లరు మహాశ్చర్య విస్మయ

స్వభావులై ఎఱుఁగక దూషించి నందులకుగాను చెంపలు వాయించుకొని మహాప్రభావ సంపన్నుఁడైన పినవీరన్నను బెక్కుభంగులఁ గీర్తించిరి నృసింహభూపతియు నపరిమితా నందమునఁ గృతినంది యపరిమిత ధనంబులతోను నగ్రహారం బులతోను గవిని సత్కరించి కృతార్థుఁడయ్యెను.

ఆధునికు లిట్టివన్నియుఁ గట్టుకథలని నమ్మరు. కాని "మంత్రాధీనంతుదైవం" అను నూక్తి ప్రకార మాలోచించి నచో నిట్టివి జరుగుట నిజమేయని మన మూహింప వగు చున్నది. మొత్తముమీద విచారించినఁ బినవీరన యద్భుత కవితాశక్తి గలవాఁడనియు నతనికి శారద వశవర్తినియనియు దెలియుచున్నది. ఈ యంశముల నతఁడు రచించిన గ్రంథ ములును రూఢిపఱచు చున్నవి. ఇతఁడు రచించిన గ్రంథ ములు:— 1. జైమిని భారతము 2. శృంగార శాకుంతలము. ఇతఁ డన్ని రసములలోను గవిత్వము చెప్పఁగలడు. రసా త్మకమైనదే కావ్యమనుమాట యీతని గ్రంథములలోఁ గాన నగును. ఇతనికవిత్వమునందుఁ గథాసందర్భమునుబట్టియొక్కొ క్కచోట నర్థకాఠిన్యమున్నను, రసము తొణుకుచుండును. భావసౌష్ఠవము, పదలాలిత్యము, కుంటుపడని నడక యర్థము గాకున్నను జదివినంతనే యొక విధమగు నానందమునుగూర్చు మాధుర్యము ఈతని జన్మ హక్కులు.

# 3. శ్రీనాథుఁడు

అతులిత రాజ్యభోగంబుల ననుభవించి సకల మహీపాలక సంస్థానంబుల విజయధ్వజంబుల ప్రతిష్ఠించి యసమాన విఖ్యాతింగని కవిసార్వభౌముఁడై నేటికిని గీర్తి కాయంబుతో విరాజిల్లుచున్నవాఁడు శ్రీనాథుఁడు. ఆంధ్ర ప్రపంచ కావ్య నిర్మాతలలో నితఁ డగ్రగణ్యుఁడు. ఇక్కవి వరేణ్యుఁడు కొండ వీటి సామ్రాజ్యమును బరిపాలించిన కోమటి వేమారెడ్డి కాలములోని వాఁడు. క్రీ. శ. ౧౩౮౦ ప్రాంతమున జన్మించి క్రీ. శ. ౧౪౭౦ తరువాత వరకు జీవించిన సంపూర్ణాయుమజీవి. ఇతఁడు సందర్శింపని రాజస్థానములును, బడయని బహువిధ సత్కారములును, గెలువని పండిత వివాదములును లేవు.

ఇతని శైశవమును గూర్చియు విద్యాభ్యాసమును గూర్చియు విపులముగాఁ దెలిసికొనుటకుఁ దగిన యాధారములు లేవు. ఇతని జన్మస్థానము కొండవీటిసీమ. తండ్రి కమలనాభకవి పుత్రుఁడగు మారయమంత్రి, తల్లి భీమాంబ. ఇతఁడు భారద్వాజస గోత్రుఁడు. ఆపస్తంబసూత్రుడు. పాకనాటి నియోగి శాఖలోనివాఁడు. ఇతనిగూర్చి యితఁడు రచించిన శృంగారనైషధమునందు బ్రాహ్మీదత్త వరప్రసాదుఁ డనియు నీశ్వరార్చన కళాశీలుండనియుఁ గృతిపతి కొనియాడినకారణంబున నితఁడును బూర్వకవులకుంబలె శైవ మంత్రోపాసకుండని తెలియు చున్నది. ఇతఁ డతిబాల్య వయస్సుననే మరుత్తరా

ట్చరిత్రమును వ్రాసెను. మఱియు నీతఁడు శాలివాహన సప్త శతి, శృంగారనైషధము, భీమఖండము, కాశీఖండము మొదలగు గ్రంథములను రచించెను.

మొదటి రెండు గ్రంథములు ప్రస్తుతము ప్రచారములో లేవు. ఈ గ్రంథద్వయ రచన కాలమునాఁటి కింకను శ్రీనాథుఁడు వేమారెడ్డి యాస్థానకవీశ్వరుఁడు గాలేదు. ఇతని పేరు పైకి వచ్చుటకు నితని నైషధకావ్యమే మూలాధారము. విద్వదాషధంబని పేరుగాంచిన యీ మహాకావ్యము మామిడి సింగమంత్రి కంకిత మొనర్పఁ బడెను. ఈ మంత్రిపుంగవుఁడు కొండవీటి సంస్థానములోఁ బ్రధానపురుషుఁడై యున్న కారణమున నీతని సాహాయ్యమున శ్రీనాథుఁడు వేమభూపాలుని యాస్థాన కవీశ్వరుఁ డయ్యెను. కోమటి వేముఁడు రసికాగ్రగణ్యుఁ డవుటంజేసి యతని యద్వితీయ పాండిత్య గరిమకు సంతసించినవాఁడై యితనిని బహువిధముల సత్కరించి గౌరవించుటయేగాక విద్యాధికారిగాఁ గూడ నొనర్చెను.

ఆ కాలములో సుప్రసిద్ధ పండితులఁ గలిగియుంచుట రాజుల కెనలేని గౌరవపాత్రమగు కార్యము. కావున మహీపాలు లందఱుఁ బండిత ప్రభులఁ దమ యాస్థానములఁ గలిగి యుండెడివారు. శ్రీనాథుని కాలములోఁ గోమటివేముఁడు, సర్వజ్ఞ సింగన, ప్రౌఢదేవరాయలు, వీరు మువ్వురు సుప్రసిద్ధ సంస్థానాధిపతులు. ఈ సంస్థానములందుఁ బేరుగాంచిన పండితోత్తములు పెక్కుమంది గలరు. సింగనమంత్రి సాహాయ్యమునఁ దాను వేముని యాస్థానపండితుఁ డైనంతనే శ్రీనాథు

నకుం దక్కుంగల యాస్థానపండితుల జయించవలెనను కోరిక గలిగెను. ఇందుకు వేముఁడును సంసించి తగినంత ప్రోత్సాహ మొసంగుటం బట్టి శ్రీనాథుఁడు మొట్టమొదట ప్రౌఢదేవ రాయుని ముఖ్యపట్టణమగు విజయనగరమున కరిగెను. ఇది యాంధ్రదేశమునకుఁ బశ్చిమమున నున్న కర్ణాటక దేశము లోనిది. ఈ సంస్థాన మప్పుడా నెగొంది సంస్థానమని వ్యవహరింపఁబడు చుండెడిది.

ప్రౌఢదేవరాయని యాస్థానములో డిండిమభట్టను నొక సుప్రసిద్ధ పండితోత్తముఁడు గలఁడు. ఇతఁడా కాలమునంగల పండితుల నెల్లర జయించుటంజేసి యతనికిఁ గవిసార్వభౌముఁ డనియు, విద్యానాథుఁడనియు, బిరుదులీఁబడుటయే గాక జయ సూచకముగా నొకకంచుఢక్కయు నొసంగఁబడెను. ఇట్టిమహా పండితు నోడింపఁదలంచి వచ్చిన శ్రీనాథునిఁ జూచి రాయలు సముచితరీతిని సత్కరించి వచ్చినపని యేమని ముచ్చటించెను. శ్రీనాథుఁడును బండిత వాదమునకై వచ్చితినని చెప్పెను. ఆ మాటకు డిండిమభట్టులికివడి "ఓహో! నన్ను జయించునట్టి పండితుఁడు నేఁటికిఁ బుట్టెగాఁబోలు!" నని పరిహాసపూర్వకముగాఁ బలుక శ్రీనాథుఁడు కోపించి "మహాశయా! మాటలతోఁ బనిలేదు. శక్తియున్నచో నెమరొకని ప్రతిజ్ఞ యెట్టిదో వివరింపు" మని పలుక డిండిమభట్టు "అయ్యా! నే నోడితినేని నాకుఁగల బిరుదద్వయంబు నీకొసంగుటయేగాక విజయసూచకమగు నీ కంచుఢక్కను బగులఁగొట్టెదను. నీ వోడితివేని గవిత్వసన్యాస మొనర్చి నాకుశిష్యుఁడగావలయు"

ననిన వల్లె యని యుత్సితో వాదమునకు గడంగెను. వీరిరువురకుఁ జంద్రశేఖరపండితుఁడు మధ్యవర్తిగా నుండెను. ఈవిధమునఁ గొన్ని నెలలు వాదించిరి. తుదకు శబ్దశాస్త్రమునందు శ్రీనాథుఁడు డిండిమభట్టు నోడించెను. తోడనే ప్రతిజ్ఞావచనప్రకారము డిండిమభట్టు తనకుంగల బిరుదులు రెంటిని శ్రీనాథున కొసంగి యందఱి యెదుటనుఁ దన కంచుఢక్కను బగులఁగొట్టెను. అది మొదలుకొని శ్రీనాథుఁడు కవిసార్వభౌముఁ డనియు, విద్యాసనాథుఁ డనియు లోకములో వ్యవహరింపఁబడెను. రాయలును శ్రీనాథు శేముషీవిశేషమునకుఁ గడుంగడు నలరి తగినట్లు బహూకరించెను.

ఇట్లు జయశీలుఁడై శ్రీనాథుఁడు కొండవీటికిఁ దిరిగివచ్చినంతనే వేముఁడెంతయు సంతసించి రావుసింగమహీపాలుని యాస్థానమున కరుగుటకుఁ బ్రోత్సహించెను. సర్వజ్ఞుఁడని బిరుదు వహించిన రావుసింగనకు వేమునకుఁ దీరని వైరము గలదు. సింగన వేమునియందుగల కోపంబునంజేసి యాతని పేర నొక బొమ్మను సభాభవనంబున వ్రేలాడఁగట్టించి నిత్యము దానిపై దా నుమియుటయేగాక తన సభికులచేత నుమియించుచుండును. ఇట్టి యవమానముఁ దెలిసికొనియు వేముఁడు బలముచాలక యూరకుండెను. శ్రీనాథుఁ డెట్లైన నీ యకృత్యమును మాన్పింపవలెనను తలంపుతో సింగన సభకుఁ బోయెను. కాని సర్వజ్ఞుని మెప్పించుట తనకు సాధ్యమగునా యని సందేహించి యది బయలు పడకుండ సర్వజ్ఞు గొప్పతనము నుగ్గడించు నట్లుగా సరస్వతీదేవిని స్తుతించెను.

ఆ స్తుతిపద్యముల జదివినంతనే యతఁడు శ్రీనాథుఁడని యెఱింగియు సింగన యతనిని గౌరవింపలేదు. అందుకు శ్రీనాథుఁడు కోపించి సింగభూపుని సింహాసనము ప్రక్కనే యున్న యున్నతాసనంబునఁ గూర్చుండెను. అట్టి యకార్యమున కయ్యాస్థాన పండిత ప్రభుం డొకండుఁ గనలి శ్రీనాథునిం జూచి "కుక్కవో, నక్కవో, పులివో, కోతివో, పిల్లివో, భూతపిల్లివో!" యని దూషింప దానినే యొక సమస్యగాఁ గొని శ్రీనాథుఁ డిట్లు పూర్తి చేసెను.

ఉ. తక్కక రావుసింగ వసుధావరుఁ డర్థుల కర్థమియ్య నే
దిక్కున లేని కర్ణుని, దధీచిని, ఖేచరు, వేల్పుచెట్టుఁ, బెం
పెక్కిన కామధేనువు, శిబీంద్రుని, వేడఁగ నేల ? యాచకా !
కుక్కవో? నక్కవో? పులివో? కోతివో ? పిల్లివో? భూతపిల్లివో ?

ఇట్టి సమస్యా పూరణంబునకు సింగన యెంతయు నలరి తోడనే సింహాసనంబు డిగ్గి శ్రీనాథునిఁ గౌగిలించుకొని యధిక గౌరవంబున సత్కరించి పలయుదానిం గోరుమని యని పల్కెను. పల్కుటయే తడవుగా శ్రీనాథుఁడును దన ప్రభుం డైన వేమునిఁగూర్చి చేయుచున్న యవమాన కార్యంబు మానుఁడని కోర నతఁడును దన తప్పు నెరింగినవాఁడై, క్షమాపణ పూర్వకంబుగా నకార్యంబును మానెను. శ్రీనాథుఁడిట్లు సఫలీకృతకార్యుండై తిరిగి కొండవీటి కరుదెంచెను.

శ్రీనాథుఁ డింతటితో దన దేశసంచారము మానక యాంధ్ర దేశంబున నన్ని దిక్కులంగల సంస్థానంబులకరిగి పెక్కు బహుమతుల నంది మిపుల ఖ్యాతిఁగాంచెను. ఇతఁడే దేశమున

కరిగి నప్పటికి నందలి జనుల యాచార వ్యవహారములు నభి
వర్ణించెడివాఁడు. ఇతనికిఁ బల్నాటిసీమయన్న సరిపడదు.
అందలి జనులు మోటువారనియు, వరియన్నము లభియింప
దనియు, ద్రాగుటకు మంచినీరుకూడ దొరకదనియు నితఁడు
వర్ణించెను. శ్రీనాథుఁడిట్లు దేశసంచారము చేయుచున్న కాల
ములోఁ గోమటి వేమారెడ్డి మరణించెను. ఇతని మరణానంత
రము కొండవీటి సామ్రాజ్యము బలము గోలుపోయి కర్ణాట
దేశాధిపతుల యధీనమయ్యెను. ఇట్టిసామ్రాజ్య మస్తమించి
నంతనే కోమటివేముని వంశస్థులు గొందరు రాజమహేంద్రి
వరమునఁ దిరిగి ప్రభుత్వమును స్థాపించిరి. ఇందు మూలపురుషు
డల్లాడ వేమభూపతి. ఇతనియనంతర మితని కుమారుఁడైన వీర
భద్రారెడ్డి రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు పండితాభిమాని
యగుటంబట్టి బెండపూడి యన్నమంత్రి సాహాయ్యము వలన
శ్రీనాథుడు వీరభద్రారెడ్డి యాస్థానకవి యయ్యెను.

బెండపూడి యన్నామాత్యుఁడు తనకు బాంధవుం
డగుట వలనను నతని మూలమున రాజాస్థాన ప్రవేశముగోరి
యున్నవాఁడగుట వలనను శ్రీనాథుఁ డతనికి భీమఖండమును
గృతియొసఁగెను. ఆస్థానకవియైన తరువాత 'అయఃపిండ' మని
పేరుగాంచిన కాశీఖండమును దెనిగించి వీరభద్రారెడ్డి కంకిత
మొనర్చెను. ఇతఁడు రాణ్మహేంద్రవరములో నున్నప్పు
డక్కడి పండితు లితనియందసూయవహించి యితనిభాష
యాంధ్రము గాదనియు, నితనికృతులు సంకరములనియు రాజు
నకుఁ జెప్పిరి. ఈ సంగతి శ్రీనాథుఁ డెఱిఁగి యా పండితులఁ

దగినయ ట్లుపమానించెను. వీరభద్రారెడ్డి యవసానదశవఱకు శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమునందే యుండెను.

వీరభద్రారెడ్డి మరణానంతరము రాజమహేంద్రవర సామ్రాజ్య మొడ్డెరాజుల యధీనమయ్యెను. అంతటితో రెడ్ల ప్రభుత్వ మడుగంటెను. నాటితోనే శ్రీనాథుని సుఖజీవనమును నడుగంటెను. ఒడ్డెరాజులు రసికులుగారు కావున వారికిఁ బండితాదరణమన్న నెట్టిదో తెలియదు. కాఁబట్టి శ్రీనాథుఁడు తన చరమావస్థలో జీవనాధారమునకుఁ గాను కృష్ణాతీరమున నున్న బొడ్డుపల్లె యను నొకగ్రామమును గుత్తకుగొని యందు నివసించుచుండెను. ఈ కాలమునుండి శ్రీనాథుఁ డెట్టి కావ్యములను రచింపలేదు. కాని పామరజనోపయుక్తములగు పల్నాటి వీరచరిత్ర మున్నగు నితర గ్రంథముల మాత్రము రచించెను.

ఆ కాలపు కవులలో బహుగ్రంథముల రచించినవాఁడు శ్రీనాథుఁడొక్కఁడే. ఇతని కవిత్వము దీర్ఘసమాసములతోను జటిలపద గుంభనముతోడను ధారాశుద్ధితోను నలరారుచుండును. కథాసందర్భమునుబట్టి యొక్కొక్కచోట నతి కఠినముగాను మఱియొక్క చోట బహుకఠినముగాను నుండును. శైలి సరళముగాను నదీప్రవాహమువలె మిట్టపల్లములులేక సమముగా నుండును. పద్యము చదువుచున్నప్పుడు నడక మత్తేభయానముఁ బోలి తాళగతికిఁ దగియుండును. ఇతఁడు రచించిన గ్రంథములన్నియు సంస్కృతకావ్యములకుఁ దెలుఁగు సేతలే కాని స్వతంత్రములు గావు. హరవిలాసము, పల్నాటి

వీరచరిత్ర, వీధినాటకము మున్నగు గ్రంథము లీ తరగతిలోనికి రావు. సంస్కృతమునకుఁ దెలుఁగు సేతలైనను స్వతంత్ర గ్రంథములవలెనె సొంపు గులుకుచుండును. మూలమును జక్కఁగాఁ దెనిఁగించుటలో నితఁ డగ్రగణ్యుఁడు. ఆంధ్రీకరణమునం దొక్కొక్కప్పుడు మూలార్థము చెడకుండా మూలములోని పదములనే యుంచెడివాఁడు. విద్వదౌషధ మగు నైషధమును అయఃపిండమగు కాశీఖండమును దెనిఁగించుటలో నితనికిఁ గల యుభయ భాషా పాండిత్యము ప్రకటిత మగుచున్నది. మొత్తముమీఁద విద్యాసనాథుఁడనుటకుఁ గవిసార్వభౌముఁ డనుటకు శ్రీనాథుఁ డన్నివిధములఁ దగియున్నాఁడు. ఇతఁడు పెక్కుదేశములు తిరిగినాఁడుగావునఁ నితని కవిత్వమునందు కర్ణాటాది యన్యదేశీయపదములు కనఁబడుచున్నవి. ఆ కాలములోఁ గర్ణాటాంధ్రములకు భేదము లేకుండుటంబట్టి "నా కవిత్వంబు నిజము కర్ణాటభాష" యని[1] యితఁడు చెప్పినాఁడు. ఇతఁడుపయోగించిన యాంధ్రపదములందును మాండలీయక భేదములు చాల గలవు.

ఇతఁడు రచించిన వీధినాటకమునుబట్టియుఁ జాటువులంబట్టియుఁ గొందరితనిని విటశేఖరుండని చెప్పుటయేగాక యందుకుఁ దగిన కొన్ని కథలను జెప్పుదురు. కాని హరవిలాసాది గ్రంథములఁ బరికించినచో నితఁడు మహాశివభక్తుఁ డని తెలియుచున్నది. ఇట్టి కవిశేఖరుని విటశేఖరుండని చెప్పుటకంటె మౌఢ్యము మఱి యున్నదా ?

ఇతఁడు బొడ్డుపల్లెను గుత్తకుఁగొని జీవించుచున్న కాలమంలో నొకప్పుడు కృష్ణ నుప్పొంగుటవలనఁ బంటలు పాడయ్యెను. గుత్తపైకము చెల్లించుట బహు కష్టమయ్యెను. ఒడ్డెరాజులు కడు మూర్ఖులు, అరసికులు గావున సిస్తుపైకమునకై శ్రీనాథుని బెక్కువిధముల బాధించుటయేగాక వీఁపుమీఁద బండలెత్తించిరి. అట్టిహింసకుఁ దాళలేక తనపూర్వపు టౌన్నత్యమును బేర్కొని పరితపించి యప్పటికి నొడ్డెరాజులు మన్నింపక హింసించుటంబట్టి శ్రీనాథునకు జీవితముపై రోతజనించెను. ఇఁక బ్రతికియుండియుఁ జేయునదేమి యని యతఁడు ప్రాణత్యాగ మొనర్చెను.

# 4. బమ్మెర పోతరాజు

పురాణ కవులలో బమ్మెర పోతరాజు మొట్టమొదట చెప్పఁదగినవాఁడు. ఇతఁడు తనకుఁ బూర్వమందున్న కవుల కుంబలెఁ దనకృతులను భూపతుల కంకిత మొనర్చి తన్మూలంబున ధనము గడించి జీవయాత్ర గడిపినవాఁడుగాఁడు. అసలు నరాంకితమన్న నితనికి గిట్టదు. ఇందుకు గారణ మితడు మహాభక్తుండగుటయే యని కొందరందురు. మరికొందరు రాజులు నీతినియమములు లేనివారని యితనికిఁగల యభిప్రాయమే కారణమందురు. ఏది యెట్లున్నను. దాను నరాంకితము చేయకుండుటే గొప్పవిశేషమని భావించి తన భాగవతమునందిట్లు వివరించినాఁడు.

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటప్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాఁజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

ఇంతటి పవిత్రబుద్ధియు దైవభీతియుఁగల పోతరాజు క్రీ. శ. ౧౩౭౫ సం. ప్రాంతమందు జనించినట్లుగా భాగవత పీఠిక కారులు వ్రాసియున్నారు. ఇది సరికాదని వీరేశలింగము పంతులుగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మరి కొందరు పరిశోధకులు క్రీ. శ. ౧౪౦౦ సం. ప్రాంతమందు జన్మించినట్లు సహేతుకముగా నిరూపించియున్నారు. ఇతని సమకాలికుఁడైన

శ్రీనాథుఁడు, రావుసింగమహీపాలుఁడు మున్నగు వారిఁబట్టియు నిదియే సరియైనదని తేలుచున్నది. ఇఁక నీతని జన్మస్థానమును గూర్చియు భిన్నాభిప్రాయములు గలవు. కొందరు కడప మండలములోని యొంటిమిట్ట యనియుఁ మరికొందరు నైజాము రాజ్యములోని యోరుగల్లనియు జెప్పుదురు. ఈ విషయమునఁ బరిశోధకులు బహుకృషి చేసి యోరుగల్లనియే రూఢి పరచిరి. భాగవతమునందు వ్రాయబడిన యేకశిలా నగర మోరుగల్లగును. కాని యొంటిమిట్ట కాదని యాంధ్రకవుల చరిత్రకారుఁడు పెక్కు కారణముల నిచ్చియున్నాఁడు. కావున బోతన జన్మభూమి యోరుగల్లనుటయే తగి యున్నది. ఇది యిప్పుడు వరంగల్ అని వ్యవహరింపఁబడు చున్నది.

ఈ మహాకవి నియోగి బ్రాహ్మణుఁడు. కౌండిన్యస గోత్రుఁడు. ఇతనితండ్రి కేసనమంత్రి. తల్లి లక్కమాంబ. ఇతనికి మల్లన యను నొకకుమారుఁడు గలఁడు. ఇతఁడే ప్రౌఢకవి మల్లన యని చెప్పుదురు గాని యిది యవిశ్వసనీయమని కొందరి మతము. ఇతనికి శ్రీనాథుఁడు బావమఱఁది యట. లోకము వాడుకనుబట్టి నమ్మవలసినదే కాని యీ విషయమును గూర్చి యెట్టి చరిత్రాధారములును గన్పడవు. చుట్టరిక మున్నను లేకున్నను వీరిరువురు సమకాలికులనుటమాత్రము వాస్తవము. శ్రీనాథుఁ డితనికంటె నిరువదియేండ్లు పెద్ద. పోతన కుటుంబమువారు మొదటినుండియు ధనికులు కారు. వ్యవసాయమే వీరికి జీవనాధారము. తాను మహాకవియైనప్పటికి ధనము సంపాదించుటకుఁ దగిన యవకాశ మున్నప్పటికిఁ బోతన

యావంకఁబోక బరంపరాగతమైన వ్యవసాయమునే జీవనాధారముగఁ గొనెను.

పోతరాజు గురుముఖమున నేవిద్యయు నభ్యసింపలేదు. స్వయంకృషివలననే మహాపండితుఁడయ్యెను. అందుకనే గద్యయందు పోతనకు పాండిత్య మలవడిన విధమునుగూర్చి "సహజ పాండిత్య" యని తన్నుఁగూర్చి చెప్పికొనినాఁడు. మనవారొక కథను జెప్పుదురు. పోతన బాల్యములో నొకప్పుడు పశువులను గాయుచుండఁగా జిదానందుఁడను యోగి యొకఁడామార్గమున నరుగుచు నతని ముఖలక్షణముల కలరి యతనికి రామమంత్ర ముపదేశించినట్లును దన్మంత్ర ప్రభావంబువలననే పోతన కుభయభాషా పాండిత్యమును మనోహర కవితాశక్తియును, గలిగినట్లు జెప్పుదురు. ఇట్టికథలు పూర్వకవులఁగూర్చి పెక్కులు చెప్పఁబడుచుండుటచేత నిదియు నగుననియు దలంపనగును. భాగవతములోని గద్యనుబట్టి విచారించినచో సహజపాండిత్యమునకుఁ గవితాశక్తికి శివానుగ్రహమే మూలకారణమని తేలుచున్నది. పోతరాజు మొట్టమొదట శైవమత ప్రవిష్టుఁడు. కాని భాగవత రచనాకాలమునాఁటికి వైష్ణవమతస్థుఁడయ్యెను. ఇట్లగుటకు రామమంత్రోపదేశమే కారణము. శ్రీరామ చంద్రుఁడీతనికిఁ గలలో సాక్షాత్కరించి తనపేర భాగవతమును దెనిఁగించుమనియడిగి కోరుటయు దీనిని బలపరుచుచున్నది. కాని కొందఱిది సరికాదనియుఁ బోతన చివరవరకు శైవుండే యనియుఁ జెప్పుదురు. ఇది యెంతవఱకు విశ్వసింపదగినదో పరిశోధకులు నిర్ణయింతురుగాక !

ఇట్లు పోతన స్వయంకృషిచేత ననిర్వచనీయ పాండిత్యమును గడించినవాఁడై తొలుదొల్త సర్వజ్ఞసింగమహీపాలుని యాస్థానంబున కరిగెను. అతఁడును బోతన భావపటిమను బరీక్షింప నెంచి తన యుంపుడుగత్తెపేర నొక గ్రంథమును వ్రాయునదిగాఁ గోరెను. అప్పటికింకను బోతన మహాభక్తుండు గాని కారణమున రాజునాజ్ఞమేఱకు భోగినీదండక మను నొక చిన్న గ్రంథమును రచించెను. ఇదియే యితని తొలికృతి. ఇది రచించినతరువాత నితనికి నరపతులు నూపు గౌరవ మెట్టిదో తెలిసెను. ఉంపుడుగత్తెపై గ్రంథమును వ్రాయునదిగాఁ గోరిన యట్టి భూపతుల కిఁక ముందెన్నడును గృతుల నియ్యరాదనియు వారి సత్కారముల కాసింపరాదనియుఁ దలంచి యంత నరాంకితమివ్వ విముఖుఁడయ్యెను. మఱి కొంతకాలమునకు శ్రీరామచంద్రుని యాజ్ఞప్రకార మమ్మహనీయుని పేరనే భాగవతమును రచించుట పూర్వార్జిత సుకృత ఫలవిశేషమనియు భవహర మనియు నితఁడు చెప్పుకొనినాఁడు.

కం. పలికెడిది భాగవతమఁట పలికించెడివాఁడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహర మగునఁట పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా?

ఇట్టి యుత్కృష్ట గ్రంథమును బోతన తెనిగించుచున్నాఁడని విని సర్వజ్ఞసింగ నృపతి తగిన కానుకలంబంపి యాగ్రంథమును దన కంకిత మొనర్పునది యని కోరెను. కాని మహాభక్తుఁడగు పోతన నృపతి యంపిన కానుకలం గొనక తన గ్రంథమును నరాంకిత మొనర్పనని తిరస్కరించి శ్రీహరి పేరనే భాగవతమును రచించెను. ఇట్లు రాజసత్కారముల

గాశింపక పోవుట చేతను, కుటుంబపోషణకుఁ దగినంత భూవసతి లేకుండుట చేతను నితనికి జీవయాత్ర బహుకష్టముగానుండెను. దారిద్ర్యదుఃఖము ననుభవించుటకైన సమ్మతించెను గాని తన కృతులనమ్మి యా ధనముచే సుఖజీవన మొనర్చుటకు మాత్రము సమ్మతింపలేదు. ఒకనాఁడు పోతన తన కుమారు నితోఁ గూడి మడి దున్నుచుండగా నామార్గమున శ్రీనాథు డరుగుచుఁ దన మాహాత్మ్యము పోతనకుఁ జూపనెంచి పల్లకిని మోయుచున్న బోయీలను నొకప్రక్క విడువుఁ డనెను. వారట్లు చేసిరి. అతనికిఁ గల బ్రాహ్మీదత్తవర ప్రభావంబు వలన బోయీలు మోయకుండఁగనే యీపల్లకి సాగిపోవు చుండెను. పోతన కుమారుఁ డావింత చూచి తండ్రికిఁ జెప్ప నతఁడు దనకుఁగల రామమంత్ర ప్రభావమును జూపనెంచి కాడికిఁ గట్టిన యొక దున్నను విడువు మనెను. అతండట్లు చేసి నప్పటికి నొంటి దున్నతోనే యరక సాగుచుండెను. శ్రీనాథుఁ డదిచూచి రెండవప్రక్క బోయీలను కూడ విడువుఁడనెను. అప్పుడును బల్లకి యథాప్రకారముగాఁ బోవుచుండెను. పోతనయుఁ గాడికిఁగల రెండవ దున్నను విడిపించెను. అరక యెప్పటియట్ల సాగుచుండెను. శ్రీనాథుఁ డప్పుడు పోతనయు సామాన్యుండు గాఁడనియుఁ దనవలెనే మహాప్రభావ సంపన్నుఁ డనియు దెలిసికొని పల్లకిఁదిగివచ్చి యతనిఁ గౌఁగిలించుకొని సంభావించి యతనితోఁ గలసి గృహంబునకరిగెను. భోజనానం తరము శ్రీనాథుఁడు పోతన నిఱుపేద తనమును గ్రహించి యతనిఁ జూచి 'బావా! నీయట్టి కవి శేఖరుఁడు కుటుంబ

పోషణమునకై యిట్టిచిక్కులం బడవలెనే? ఎందుకుం గొఱగాని యీ వ్యాపాయమే నీకు జీవనాధార మయ్యెనా? భాగవతము సేవతికైన నంకిత మొనర్ప వలసినదని కోరెను.

అందుకేమని సమాధానము చెప్పుకొనాయని పోతన విచారించుచుండ నతని యెదుట సరస్వతీదేవి యేడ్పుమొగం బుతో నిలిచి తన్ను రాజుల కమ్మవద్దని పలికినట్లు దోఁచెను. అప్పుడతఁడు పులకాంకిత గాత్రుఁడై సరస్వతి నుద్దేశించి—

ఉ. కాటుక కంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దను గాదిలి కోడల! యో మదంబ! యో!
హాటకగర్భురాణి! నిను నాఁకటికైఁ గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!

అని యోదార్చి యట్టి యుద్రేకముతో శ్రీనాథుని వంకఁ దిరిగి "బావా! నీచెప్పిన వాక్యంబులు సత్యములె సమ్మ తంబులుగావు." ఇటు వినుము.

ఉ. బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁ గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి? గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైన నేమి? నిజదారసుతోదర పోషణార్థమై.

అని సమాధానము చెప్పెను. ఇందువలన శ్రీనాథునకుఁ దల వంపులయ్యెను. తన కృతులను నరాంకిత మొనర్చి యపరి మిత ధనంబులఁ గొనుచుండుటంజేసి తన్నే యీరీతిగా నాక్షే పించెనని శ్రీనాథుఁడు తలంచెను. అతఁడంతటితో నాసంగతిఁ

గూర్చి యుచ్చరింపక కొన్నిదినంబు లచ్చటనేయుండి పోతన భాగవతమును సాదివరకుఁ జదివి గజేంద్రమోక్షణ ఘట్టము నందు తనకేదో పెద్ద సందేహ మున్నట్లు "బావా! ఎవరికిఁ జెప్పకుండ నేపరికరమును గొనకుండ విష్ణుమూర్తి గజప్రాణావ నోత్సాహియై పరుగెత్తె నంటివి. ఏ సాధనము లేకుండ మకరి నెట్లు చంపఁగలఁడు? గజేంద్రు నెట్లు కాపాడఁగలఁడు? ఇది చిత్రముగా నున్నదే!" యని పరిహాసించెను. అప్పటి కెట్టి సమాధానముఁ జెప్పక యానాఁ డన్నముఁ దినువేళ శ్రీనాథున కంటెఁ బోతన ముందుగా లేచి శ్రీనాథుని కుమారుని నొకచో దాచియుంచి వచ్చి, యెక్కుడలేనిదుఃఖముతో "బావా! నీ పిల్లవాఁడు బావిలోఁ బడెనా" డని పలికెను. ఆమాట వినుటయే తడవుగా శ్రీనాథుఁడు చేయైనఁ గడిగి కొనక యాత్రముతో లేచివచ్చి "ఏడి నా కుమారుఁడేడీ?" యని యఱచుచు బావిచుట్టు దిరుగనాగెను. అప్పుడు పోతన శ్రీనాథుని జూచి "బావా! ఏ పరికరములు లేకుండ విష్ణుమూర్తి పోయి చేయునదేమని పరిహాసించితివే? ఇప్పుడు నీవు చేయునదేమి? త్రాడు నిచ్చెన లేకుండ వచ్చి కుమారు నెట్లు రక్షింపఁగలవు? నీకున్న పుత్రవాత్సల్యము పరికరము మాటఁ తలపెట్టక నిన్నెట్లు పరుగెత్తించినదో విష్ణుమూర్తికిఁ గల భక్తవాత్సల్యముగూడనట్లే పరుగెత్తించినది. రమ్ము. నీపుత్రుఁ డింట సుఖముగనే యున్నా" డని సమాధానము చెప్పెను. శ్రీనాథుఁడు తన యవివేకమునకు మిగుల లజ్జించెను. పోత రాజుఁ గూర్చి చెప్పదలఁచినచో నిట్టి కథలు పెక్కులు గలవు.

మొత్తముమీద నితఁడు మహాప్రభావ సంపన్నుఁడని తలంపవలసి యున్నది. ఈయన రచించిన గ్రంథములు:—
1. భోగినీ దండకము, 2. శ్రీమదాంధ్ర భాగవతము, 3. వీరభద్ర విజయము. భాగవతములో దక్షాధ్వరఘట్టమునఁ జేసిన శివదూషణ పరిహారమునకుఁగాను వీరభద్ర విజయమును రచించితినని పోతనయే చెప్పినాఁడు. భాగవతమును రచించిన తరువాతఁ దనకుఁ గృతి యివ్వలేదని సర్వజ్ఞసింగనృపతి యా గ్రంథము నపహరించునేమో యని పోతన యద్దాని నొక మందసమునందుంచి భూమిలోఁ బాతిపెట్టించెను. అందువలన నందలి కొన్ని భాగములు శిథిలములుకాఁగా బోతన శిష్యులగు వెలిగందల నారయ, యేర్చూరి సింగన మొదలగువా రా భాగములను, బూర్తిచేసిరి. అయినప్పటికి గ్రంథ మంతయుఁ బోతన కర్తృత్వము క్రిందనే వ్యవహరింపఁ బడుచున్నది.

భాగవతమునందు సంస్కృతాంధ్రములు రెండును సమముగా నున్నవి. మూలమునుఁ దెనిగించునట్లుఁ బూర్వులకుంబలెఁ దెనిగించక వర్ణనాంశములందు భక్తివిషయములందుఁ బొడిగించి తన గ్రంథమును మూలముకంటె రమణీయముగఁ మార్చినాఁడు. ఈతని కవితామాధుర్యమును గూర్చి యెంత చెప్పినను జాలదు. ఈ విషయము ననుభవించినవారు శంకింపరు. పదలాలిత్యముతోను, యమకముతోను, అనుప్రాసాద్యలంకారములతోను, జదివినంతనే యర్థము గాకున్నను నింపుగలిగించు మనోహరమైన శైలితోను,సముద్రతరంగముల

వలె నుయ్యెలలూఁగు పదప్రయోగములతోను, బోతన కవిత్వ మలరారుచుండను. కవియను పేరు పోతనకే చెల్లుచున్నది. వట్టి వట్టి వ్రాసినట్లుగాని, పాదపూర్తికొఱకు మాఱుమూల నున్న పదములఁ బ్రయోగించినట్లుగాని, యితని కవిత్వమునం దెచ్చటను గానరాదు. కవిత్వము పోతనసొమ్ము. ఏ కవిత్వముఁ బోతన కవిత్వముతో సరిదూఁగదనుటయే నిశ్చితార్థము.

# 5. అల్లసాని పెద్దన

శ్రీనాథునితరువాత నతులిత రాజభోగముల ననుభవించుటేకాక రాజసత్కార గౌరవంబులకుఁ బాత్రుండై జగద్విఖ్యాతిఁ గడియించి సుప్రసిద్ధ కవిశేఖరుండని పేరు గాంచినవాఁ డల్లసాని పెద్దనయే. శ్రీనాథునకుఁ గవిసార్వభౌమ బిరుద మున్నట్లీతని కాంధ్రకవితాపితామహుం డను బిరుదు గలదు. ఇమ్మహాకవి పురాణకవులకంటెఁ గావ్యకవులకంటె బ్రబంధరచనా విధానమున గ్రొత్తగ్రొత్త త్రోవలు చూపి యిట్టి బిరుదు నందెను. ఇదివరకున్న కవులెల్లరు సంస్కృత కావ్యములఁ దెనిఁగించుటయందే దమ కవితాశక్తులఁ జూపి యుండిరి. ఇంక నితఁడన్ననో వారిమార్గమునం బోక స్వతంత్ర కావ్యరచనకుఁ గడంగెను. ఏదోయొక మూలకథను గొని యిచ్చవచ్చినట్లుగా దానిం బొడిగించి నూతనాంశములఁ గల్పించి రసపోషణము పాత్రపోషణము వర్ణనావిశేషములు మున్నగు కావ్యలక్షణముల గమనించి శేముషీ ప్రజ్ఞావిశేషంబులు దెల్లంబులగునట్లు రచించుటయే స్వతంత్ర కావ్యమనఁబడును. ఇట్టి కావ్యమునకు మాతృకయైన కథ కడు కొద్దిగా నున్నను గల్పనలతో నిండార వదియే యుద్గ్రంథమగును. ఇట్టి రచనకు బెద్దనయే మొట్టమొదటివాఁడు. అట్లయ్యు నితఁడే పెద్దయయ్యె. ఇతనితరువాత కవులెల్లరు నితని మార్గముననే యనుసరించి తమ తమ గ్రంథముల రచించిరి.

ఇతఁడు కర్ణాటాంధ్ర దేశములు నెదురులేక పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయల కాలములోనివాఁడు. రాయలకు నీతఁడన్న గౌరవము మెండు. ఈ మహారాజ నాస్థానమునంగల యష్టదిగ్గజము లను నెనమండుగురు పండితులయం దితఁ డగ్రగణ్యుఁడు. ఇతనియెడ రాయల కెంత గౌరవము కలదో తక్కుంగల పండితులకుఁ గూడ నంతటి గౌరవము గలదు. ఇతఁడు నియోగిశాఖకుఁ జెందిన నందవరీక బ్రాహ్మణుఁడు. చొక్కనమంత్రి కుమారుఁడు. ఇతనిని స్మార్తుఁడని కొందఱు, వైష్ణవమతస్థుఁ డని మఱికొందఱుఁ జెప్పెదరు. ఆతని గురువు శఠగోపయతి. ఈ గురు పరంపరనుబట్టియే యితనిని వైష్ణవమత ప్రవిష్టుఁడందురు. కాని యితనిని గ్రంథాదింగల స్తోత్రమునుంబట్టి విచారించినచో నితఁడు స్మార్తుఁడని స్పష్టముగాఁ దేలుచున్నది. ఒకవేళఁ దన ప్రభువుమీఁది యభిమానముంజేసి వైష్ణవమతస్థుఁ డయ్యెనేమో చెప్పలేము. ఇతని జన్మస్థాన మెద్దియో యింతవఱకుఁ జక్కఁగ దెలియదు.

ఇతనికి మనుచరిత్రము వలననే "యాంధ్రకవితా పితామహ" యను బిరుదము గల్గెనని కొందఱు చెప్పెదరు గాని, యది సరికాదు.

"ఆంధ్ర కవితా పితామహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకుఁ"

అను కృష్ణరాయని వాక్యముంబట్టి మనుచరిత్రమునకుఁ బూర్వమే యితని కీ బిరుదుగల్గినట్లు రూఢియగు చున్నది. అయిన యిది యితని కెట్లు కల్గినది ? దీనికిఁ బండిత పరీక్షయే

కారణమై యుండవచ్చు. ఒకనాఁడు కృష్ణరాయఁడు పండితసభ గావించి, పండితప్రముఖులుండఁగు [illegible]న నొక వసిఁడి పళ్ళెరమునఁ గవిగండపెండేర ముంచి 'పండితోత్తములారా! ఉభయ భాషల యందు సమానముగా సరళముగాఁ గవిత్వము చెప్ప నేర్పుగల పండితుఁడీ గండపెండేరమును గొనునది. మీ మీ కవితా సామర్థ్య ప్రకటనంబున కిదియే తగిన సమయ' మని పలికి యూరకుండెను. కాని పండితు లెవరును దానిం గొన సాహసింపరైరి. రాయలు చాలకాలము వేచియుండెను. కాని 'నేను' అని ముందుకు వచ్చిన వాఁడొక్కఁడును లేఁడు. అప్పుడు రాయలే సింహాసనము నుండి లేచి—

ఉ. ముద్దుగ గండ పెండియరమున్ గొనుఁడంచు బహూకరింపగాఁ
నొద్దిక నాకొసంగు మని యొక్కరు గోరఁగ లేరు లేరొకో.

అని చదివినంతనే యింకఁ దాళలేక పెద్దన లేచి, తన యుభయభాషాకవితా నైపుణ్యము ప్రస్ఫుటంబగు నట్లు త్పలమాలికా వృత్తమాలిక నొకదానిని నాసువుగాఁ జెప్పి యందు సంస్కృతాంధ్ర కవిత్వతత్త్వముల రూపించి రాయలను, సోదర పండితులను సభికులను మెప్పించెను. అప్పుడు రాయలంతటి కోర్కెప్రకార మాగండపెండేరమును దన చేతులతోఁ బెద్దన పాదమునకుం దొడిగి కవిగండభే యనియు నాంధ్రకవితా పితామహ యనియు బిరుదు లొసంగి గౌరవించెను.

అది మొదలుకొని రాయలకుఁ బెద్దనయెడం గల గౌరవము ద్విగుణమయ్యెను. అట్టి కవివరేణ్యుచేత నేడైన గ్రంథ

మును రచింపజేసి తాను గృతి నందవలయునని యా మహా రాజున కెంతో యభిలాష కలదు. అట్టియభిలాషతోఁ దనపేర నేదైనఁ గృతి రచింపవలసినదని మాటిమాటికిఁ బెద్దన్నను బ్రోత్సహింపఁజొచ్చెను. కాని పెద్దన్నమాత్రము కృతి రచింపక యాలసించుచు నొకనాఁడు రాయలంజూచి,

చ. నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన భోజన మూయ్యెలమంచ మొప్పు త
ప్పరియు రసజ్ఞులూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినఁగాక యూరక కృతుల్ రచింపు మటన్న శక్యమే!

యని వచించెను. రాయలు పద్యమువలనఁ బెద్దన యభిప్రాయమును గ్రహించి గోకట గ్రామాద్యనేకాగ్రహారంబులిచ్చి సమస్త సౌకర్యముల నొడఁగూర్పఁ బెద్దన్నయుఁ దన కవితా శక్తి తెల్లంబగునట్లు మనుచరిత్రంబను మహాప్రబంధమును రచించి కృష్ణరాయలకుఁ గృతి యొసంగెను. వెండియు నొకానొకచోటఁ దెలుగుకవిత్వ మెట్లుండవలయునో వర్ణించి తన కవిత్వముగూడ నట్లే యుండునని గాఢముగా సూచించెను.

పెద్దనయొద్ద బహుకాలము నుండియు విద్యాభ్యాసము చేయుచున్న యొక భట్టు గలఁడు. ఇతఁడే వసుచరిత్రాది కృతి కర్తయగు భట్టుమూర్తియని కొందఱు చెప్పుదురు. ఇతఁడు పెద్దనయొద్ద సంస్కృతాంధ్రములఁ జక్కగా నభ్యసించి శ్లేష కవిత్వమందు గొప్పశక్తిఁ బడసెను. ఇతనికి రాయలను సందర్శింప వలయునన్న కోర్కె మెండుగాఁ గలదు. అట్టి యవకాశమును గలిగించునదిగా నితఁడు పెద్దనామాత్యు నన్ని

మాటలో గోరెను. కాని యేమి హేతువు చేతనో. పెద్దన యీవిషయమును గాలహరణము సేయఁజొచ్చెను. అందుచేత భట్టు, ఇక నాతని నడుగుటమాని యొకనాఁడు తనకుఁ దానే రాయలవద్ద కరిగి తన కవితా మాధుర్యంబున నతని మెప్పించి దనకుఁ బెద్దన యొనర్చిన యుపకారమును మఱికొన్ని లేనిపోని దోషములను జెప్పి తన స్థితి 'కుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చి నట్లయ్యె' నని విన్నవించుకొనెను. అందుమీఁద నిజ మారయ దలఁచి రాయ లప్పటికప్పుడే పెద్దనను రావించి ముందుగా నేమియు నుడువక 'కుంజర యూథంబు దోమ కుత్తుకఁ జొచ్చెన్' యను సమస్య నిచ్చెను. పెద్దనయు నది యెల్లఁ దనిశిష్యుని దుస్తంత్రమే యని తెలిసికొని యా సమస్యయు నతని దేయని గ్రహించి కోప దృష్టితో నతనిఁ దిలకించుచు బుద్ధిహీనుఁడా !

కం. గంజాయిత్రాగి తురకల; సంజాతులగూడి కల్లు చవిగొన్నావా
లంజలకొడకా ! యేటికిఁ, గుంజరయూథంబు దోమకుత్తుక సొచ్చెన్.

అని యతని పరముగాఁ బూరించి యనంతరము రాయలదిక్కు మొగంబై యా మహారాజిచ్చిన సమస్యగా నిట్లు పూరించెను.

కం. రంజనచెడి పాండవులరి, భంజనులై విరటునిగొల్వపాలైరకటా !
సంజయ ! విధినేమందును; గుంజరయూథంబు దోమకుత్తుక సొచ్చెన్.

ఇట్టి ద్వివిధ సమస్యాపూరణంబునకు రాయ లెంతయు సంతసించి పెద్దన్నను మఱేమియు నడుగఁజాలక యుపలక్షింపి

భట్టునకుఁ గొంత ద్రవ్యమిచ్చి యవసరమైనప్పుడు తన్ను జూచునది యని చెప్పిపంపెను. అది మొదలు భట్టు తన్ను లంజలకొడకా యని తిట్టినందులకుఁ గాను పెద్దనయెడ విరోధముం గొని తగిన ప్రతీకార మొనర్పవలయునని యత్నించుచుండెను. ఇట్టియత్నముతో నతఁ డొకనాఁడు తన చెలికాఁడైన మాధవునితోఁ గలిసి వీధిని బోవుచుండగా నొకచోటఁ దిమ్మకవి వాకిటఁ బెద్దనాదులు గూడియుండిరి. అది చూచి భట్టు వారి నెల్లర నవమానించుట కదియే తగిన సమయమని వారు వినునట్లుగా—

'వాకిట కావలి తిమ్మన; వాకిటి కవికోటి మాధవా! కిటికోటే!

యని దూషించెను. అందులకుఁ బెద్దన యెంతయుం గనలి తీవ్రగతితో భట్టును జేరంజని.

కం. ప్రాకృత సంస్కృతఘూర్జర
మూకీకృత కుకవితుంగ మస్తాశతికిన్
వాకిటి కావలి తిమ్మన
వాకిటి కవికోటి మాధవా! కిటికోటే!

యని యాసమస్యను మహోన్నతార్థసూచకముగాను భట్టుకుఁ దలవంపు లగునట్లును, బూరింప నతఁడు నోరెత్తలేక తల యెత్తఁ బోక ముందునకుఁ బోయెను. ఈకథ యెంతవఱకు నిజమో చెప్పలేము. పెద్దన్నఁ గూర్చి చెప్పఁ దలఁచినచో నిట్టికథ లెన్నేనియుం గలవు. మొత్తముమీఁద బెద్దన విద్యావినోదము లన్నియు సత్యదూరములు గావనిమాత్రము విశ్వసింపవలెను.

ఈ మహాకవి రచించినది మనుచరిత్ర మొక్కటే. ఈ గ్రంథమునకు స్వారోచిష మనుసంభవ మనియుఁ బేరుఁ గలదు. ఇతని కవితావధూటి మృదుమధుర కల్పనాలంకారములతో నొప్పుచుండును. సాహిత్యపటిమ సంపాదించుకొను వారికి మనుచరిత్రము మొదటి గ్రంథము. ఈయన కవిత్వము సంస్కృతజటిలముగ మిశ్రముగను,నవ్య దేశపదప్రయోగంబులతోను బ్రకాశించుచుండును కొన్ని కొన్ని పద్యములందుఁ దెలుగు పదములు కడు తక్కువగానుండి సంస్కృతపదభూయిష్ఠములై దీర్ఘసమాసములు మెండుగా నుండును. మనోహర భావములందు, భావప్రకటనకుఁ దగిన మృదుపదప్రయోగము లందుఁ, గల్పనా విశేషములందుఁ బెద్దనను మొదటఁ జెప్పవలయును. ఈయన రచించిన గ్రంథ మొకటైనను చాటువులు మాత్రము చాలఁగలవు. ఇమ్మహాకవినిఁగూర్చి కవిచౌడప్ప యేమని చెప్పినాఁడో చూడుఁడు,

క. పెద్దనవలెఁ గృతిసెప్పిన, బెద్దనవలె సుకవివరులఁ బెద్దనవలెనా ?
యొద్దనవలె మొద్దనవలె, గ్రద్దనవలెఁ గుందవరపు కవిచౌడప్పా !

ఈ కవివరేణ్యుఁడు శ్రీకృష్ణదేవరాయల నిర్యాణానంతరము గూడ జీవించియుండెను. రాయలు మరణించినంతనే సామ్రాజ్య శక్తి కొంతవఱకు సన్నగిల్లెను. కొందరు తురుష్క ప్రభువులు తిరిగి తలయెత్త సాహసించిరి. ఇది యిట్లుండగాఁ గటకదేశాధీశుఁడగు గజపతి యిదియే యదనని విద్యానగరముమీఁదికి దండెత్తి వచ్చెను. రాయల మరణముచేఁ గలిగిన ప్రబల శోకంబున విజయనగర సైన్యములెల్ల నిర్వీర్యములై యుండెను.

ఎచ్చటను యుద్ధప్రయత్నములే గానరావు. ఈ కారణములం బట్టి గజపతివలనఁ దమకోటమి గలుగునేమోయని విజయనగర వాసులు భయపడఁజొచ్చిరి. అత్తఱి పెద్దనార్యుఁడు ప్రభు మరణముచేఁ గలిగిన దుఃఖమును గజపతి దుండగచేతఁ దీవ్ర కోపముగా మాఱఁ [illegible] గజపతియొద్దకుఁ బోయి యతనిఁ దీవ్రదృష్టితోఁ జూచుచు,

కన్నడరాజ్యంబు సొచ్చితే గజపతీంద్ర
తెరచినిలు కుక్క సొచ్చిన తెఱఁగుదోఁప.

అని కఠినముగా దూషించెను. అందులకుఁ గజపతియెంతయో లజ్జించి పెద్దనఁజూచి "అయ్యా! నేను యుద్ధమునకై రాలేదు. ప్రభుమరణశోక దందహ్యమాన మానసులగు ప్రజలఁ బరామర్శించుటకుగా నిట వచ్చితి. మన్నింపుఁ" డని పల్కి యాక్షణమే యటనుండి సర్వసైన్యములతోఁ గదలిపోయెను. ఇట్లు పెద్దన మనస్సునకు శాంతి యనునది లేదు. రాయల నిర్యాణ మాతనికి దీవ్రసంతాప కారణమయ్యెను, తన్నుఁ బూలతోఁ బూజించి గౌరవించిన మహారాజు మరణించి నప్పు డేమహనీయుని మనస్సు శాంతి నొందగలదు? అదిగాక సామ్రాజ్య పరిస్థితులుకూడఁ దారుమాఱగు చుండెను. ఎక్కడఁ జూచినను దొంగరలే, గడబిడలే, అలజడులే. ఇట్టి విషమ పరిస్థితులయందుఁ దాను జీవించియుండుట తన దుష్ట ఫలమనియే పెద్దన భావించెను.

రాయలమరణము హృదయశల్యమై బాధింపఁ బెద్దనఁ గొద్దికాలములోనే మరణించెను. ఇతని జననకాలముగాని

మరణ కాలముగాని యిదిఁ ని మనకు జక్కఁగాఁ దెలియక పోవుటచేత నితని జీవితకాల మప్పటినుండి యింతవఱకని మనము నిర్ధారణగా జెప్పలేము. కాని మొత్తముమీఁద విచారించినచో నతఁడు సుమారు డెబ్బది లేక యెనుబది యేండ్లు జీవించెనని తేలుచున్నది. దీనింబట్టి యతని కాలము క్రీ. శ. ౧౫ వ శతాబ్దాంతము మొదలు ౧౬ వ శతాబ్దమధ్య కాలము వఱకని నిర్ణయింప వచ్చును. ఈ నిర్ణయమునకు రాయల పరిపాలనకాలముకూడఁ జాలవఱకుఁ దోడకుచున్నది.

# 6. తెనాలి రామకృష్ణుఁడు

విజయనగరమును బరిపాలించిన శ్రీకృష్ణదేవరాయల యాస్థానములో నష్టదిగ్గజములని ప్రఖ్యాతికెక్కిన యెనమండ్రు కవిశిఖామణుల యందు తెనాలి రామకృష్ణుఁడు ముందు చెప్పఁదగినవాఁడు. ఈతని చరిత్ర వింతవింత కథలకుఁ బట్టుగొమ్మ యగుటంబట్టి యితనిఁగూర్చి తెలియనివారే యుండరు. పామర జనోపయోగముగా నతని చరిత్ర కథలుగను నాటకములుగను నిదివరకే వ్రాయఁబడి యున్నది. ప్రస్తుతము విద్యార్థి జనోపయోగ మగునట్లు వ్రాయనెంచుటయే నాయీ రచనకుఁ గారణము.

రామకృష్ణుఁడు శుక్లయజుశ్శాఖలోని నియోగి బ్రాహ్మణుఁడు. ఇతని జన్మస్థలము కృష్ణామండలములోని గార్లపాడను నొక గ్రామము. ఊరిపేరే యింటిపేరుగా నుండు వాడుకంబట్టి యితని యింటిపేరు గార్లపాటివారని కొందఱు చెప్పుదురు. ఈశ్వరప్రగడవారని మఱికొందఱు. ప్రస్తుతము వాడుకలో తెనాలివారని చెప్పఁబడుచున్నది. ఇతనితండ్రి రామయమంత్రి. తల్లి లక్ష్మమ్మ. కౌండిన్యస గోత్రుఁడు. ఇతఁడు పూర్వకవులకుంబలె శైవమత ప్రవిష్టుఁడు గాఁడు. వైష్ణవమతస్థుఁడు. ఇతఁడు రచించిన గ్రంథములు, నంవలి వర్ణనలు నితని మతమును గూర్చి తెలుపుచున్నవి.

రామకృష్ణుఁడు పుట్టిన కొలఁది కాలములోనే తల్లిదండ్రులు లేని వాఁడయ్యెను. అందుచేత నితని మేనమామయే యితని పోషణకర్తృత్వమును వహించి తన వాసస్థానమగు తెనాలికిఁ గొనిపోయి మిక్కిలి మక్కువతోఁ బెంచుచుండెను. ఆ గ్రామములోని రామలింగేశ్వరుఁ డను దేవుని పేరనే యితనికి నామకరణము చేయఁబడెను. రామలింగమను పేరితఁడు వైష్ణవమత ప్రవిష్టుఁ డైనప్పుడు రామకృష్ణుఁడుగా మాఱినదని కొందఱు చెప్పుదురు. తన ప్రభుండైన కృష్ణదేవరాయలు వైష్ణవమతస్థుఁ డగుటంబట్టి యతనికిఁ బ్రీతికరముగా నుండునట్లు రామలింగమే పేరు మార్చుకొనెనని మఱికొందఱందురు. ఏది యెట్లున్నను బ్రజాసముదాయములో రామలింగ మనియు, గ్రంథములో రామకృష్ణుఁడనియు నితని పేరు వ్యవహరింపఁబడుచున్నది. ఈ నడుమ రామలింగఁడు వేఱు రామకృష్ణుఁడు వేఱు — అనియొక సిద్ధాంతము బయలుదేరినది. కాని దానికిఁ దగిన యాధారములు గాన్పించుట లేదు.

ఇతఁడు చిన్నప్పటినుండియు కడు దుడుకుఁదనము గలవాఁడు, అందులో మాటకారి. ఈ కారణములచే నతనికిఁ జదువు వానకాలపుఁ జదువువలె నుండెను. ఒక్కనాఁడైనఁ దిన్నఁగా బడికిఁ బోయెడివాఁడు గాడు. పోయినాఁడో పంతులు గారికిఁ బంగనామములు పెట్టి యిటుచూచునప్పటి కటుమాయమయ్యెడివాఁడు. ఇట్లు తుంటరియై పొలములోఁ దిరుగునెడ నొకనాఁడొక సిద్ధుఁడామార్గమునఁ బోవుచు రామకృష్ణుని ముఖలక్షణములం బట్టి యతని భావిదశ నెఱింగినవాఁడై

చేరంజని 'బాలకా! నీవు ముందొక మహాకవి వయ్యెదవు. నేను నీకొక మంత్రము నుపదేశించెదను. ఆ మంత్రమును శ్రద్ధతోఁ జపింతువేని నీకుఁ గాళికాదేవి ప్రత్యక్షమగును. ఆ మహాదేవి కృపవలన నీ కుభయ భాషలు కరతలామలకము లగు' నని చెప్పి యామంత్రము నుపదేశించి చనియెను రామ కృష్ణుఁ డా రాత్రి యామంత్రప్రభావం బెట్టిదో యెఱుంగఁగోరి యా యూరంగల కాళికాలయంబున కరిగి కడు శ్రద్ధతో, నా మంత్రమును జపింపసాగెను. అంతఁ గొంత పడికి నమ్మంత్ర ప్రభావంబువలనఁ గాళికాదేవి ప్రత్యక్షమై 'బాలకా! నీభక్తికి మెచ్చితి ఇదిగో నాహస్తమునంగల యీపాత్రలను జూడుము. ఈ పాత్రలోని పాలను త్రాగితివేని భాగ్యవంతుడ వయ్యెదవు ఇందులోని పెరుగు గ్రోలితివేని మహాకవివై రాజసన్మానము గాంచెదవు. ఇందేది నీకిష్టమో కోరుకొను' మనిపలుక రామఁ కృష్ణుఁడు 'అమ్మా! ఆ రెండుపాత్రలనిమ్ము చూచి నాకిష్ట మైనదానిఁ గొనెద' నని చెప్పగానే యాతల్లియును నా రెండు గిన్నెల నిచ్చెను. ఇచ్చుటయే తడవుగా రామకృష్ణుఁడాగిన్నెల లోని దధిక్షీరములఁ ద్రావి 'అమ్మా! రెండును నాకిష్టమైనవే కనుక రెంటినిఁ గ్రోలితి' నని పలికెను. ఆ పలుకుల కాదేవి యలిగి 'ఓరీ! ఎంతపనిచేసితివిరా? నిన్నేమిచేసెదనో చూడు' మని భయపెట్ట నతండా తల్లియడుగులఁబట్టి అమ్మా! తల్లియే, బిడ్డపై నలిగిన నింక రక్షించువారెవ్వరు? దయఁజూపు' మని ప్రార్థించెను. కాళికాదేవియు శాంతించినదై 'ఓరీ! ఈయప చారమునకుఁగాను నీవు వికటకవి వయ్యెదవు. అయినను సభా

పూజ్యుండ వగుము'వని యనుగ్రహించి యదృశ్యయయ్యెను. రామకృష్ణుండును దేవీప్రసాదంబు వలనఁ జిరకాలముననే యాంధ్రభాషయం దసమాన పాండిత్యమును గడించి తన ప్రజ్ఞావిశేషంబులు వెలికిఁ దోపనీయక నివురుగప్పిన నిప్పువలె నుండెను.

ఇట్లు కొంతకాలము గడచినతరువాత రామకృష్ణునికెట్లయిన రాజసన్మానంబును బడయవలయునను తలంపు గలిగెను. ఆకాలములో నాంధ్రభోజుండని ప్రఖ్యాతిఁగన్న శ్రీకృష్ణదేవరాయల చరితంబు నెఱింగి రామకృష్ణుఁడు తన తలంపు మేరకు విజయనగర సంస్థానమున కరిగెను. కాని యతని ప్రజ్ఞా విశేషంబు లచ్చటివారికి దెలియని కారణంబున నతనికిఁ దొలుదొల్త రాజసభా ప్రవేశంబు కలుగదయ్యె. కొన్నినాళ్ళకు రాజగురుండగు తాతాచార్యుల సాహాయ్యంబున రాజసభఁ బ్రవేశించి రాయలను దర్శించి, నిజకవితానుసారసంబున నెల్లరను, సంతుష్టులఁ గావింప, రాయలు, నల్లసాని పెద్దనాదికవులు నతని కవితామాధుర్యంబున కలరి యాస్థానకవిగాఁ గైకొనిరి. అది మొదలు రామకృష్ణుఁడు కాళిదత్త వరప్రసాదంబు వలనఁ బండితాదరణీయుఁడై రాయలకు మూర్చినవాడై సుప్రసిద్ధుఁడయ్యెను. ఆస్థానకవి జనాగ్రగణ్యుండగు నల్లసాని పెద్దనయు నితనిని మిక్కిలి గౌరవముతోఁ జూడసాగెను. ఎంతటిపండితుఁ డైన రామకృష్ణు మోల నోరెత్తుటకు భయపడెడివారు. ఒప్పులు తప్పులుగాను, దప్పులు ఒప్పులుగాను సమర్థించు శక్తి యతనియం దుండుటచేత నెంతటి నిర్దుష్టకవిత్వము నందైన

నితఁడు తప్పులెన్నక మానఁడు. అందువలన సభ కరుదెంచు టకు గొప్ప గొప్ప పండితులే భయపడఁ జొచ్చిరి. రామకృష్ణుఁ డింతటితో నూరకుండక పెద్దనాదులు వలదను చున్నను వినక రాయాస్థాన పండితసభకు 'భువనవిజయము' అను పేరు పెట్టెను. ఇట్టిపేరుతో రాయల పండితసభ యెదురులేని దయ్యెను. పెద్ద నాదుల గెలుచుటకుఁగాని, వారికీడగు వారిని యడిపించు కొను టకు గాని, పండితులెవ్వరును సాహసించరైరి. సాహసించినచో రామకృష్ణుఁడు భంగపఱచుననియే యెల్లరి తలంపు. ఇట్లుండ నొకనాఁడు పండితాగ్రేసరుఁడనియు, సహస్రఘంటకవి యనియు బేరుగాంచిన ప్రగడరాజు నర్సన యను నతఁడు వచ్చి రాయ లను సందర్శించి "వాదార్థినై వచ్చితిని, సభగావింతురే?" యని యడుగ రాయలును పండిత ప్రియుఁడు కావున నతనిఁ దగినట్లు సత్కరించి రేపు వచ్చునది యని చెప్పి పుచ్చెను. ఈ పండితోత్తముని ప్రజ్ఞావిశేషములు సుప్రసిద్ధము లగుటం బట్టి పెద్దనాదులు తమకోటమి తప్పదనియు నాఁటితో భువన విజయ మను పేరు మాయుననియు విచారపడఁ జొచ్చిరి. కాని రామకృష్ణుఁడు మాత్రము విచారపడక యాతని నోడించు భారమంతయు దానువహించి వారివిచారంబుఁ బోఁగొట్టెను. మఱుదినము రాయలు పండితసభ గావించెను. నర్సనయు నరు దెంచి వాదమునకు సిద్ధముగా నుండెను. అయ్యెడ రామ కృష్ణుండు మారువేషమున లక్షఘంటకవి యనుపేరుతో సభ కరుదెంచి యగ్రస్థాన మలంకరించెను, అంత రాయల యను మతిమీఁద సహస్రఘంటకవినిఁ జూచి "అయ్యా, మీరన్నిటఁ

ప్రసిద్ధులగుటంబట్టి మీవలన నాకుంగల రెండు సంశయంబులం బాపుకొన నెంచినాండ. నాకింతవరకుం జెప్పినదానిం జక్కగా వ్రాయనేర్చిన వాండును, దప్పులు దిద్దుటయందు నేర్పుగల వాండును గావింపవలెరి. ఈ పనులు మీచేత నగునే!" యని పలుక నర్సన పక్కనవ్వి 'మీ సంశయములందీర్ప మేమేల? మా శిష్యుండేచాలు' నని నిర్లక్ష్యముగాం జెప్పెను. అందులకు రామకృష్ణుండెంతయు గోపించి 'అట్లయినచో మీరే యిందు లకుం గడంగుం' డని పలికి, యాకును గంటము నిచ్చి, 'అయ్యా నేం జెప్పునది యాలసింపక వ్రాయవలయును సుమా!' అని,

క. త్పవ్వంట బాబా, తలపైం
బువ్వంటజాబిల్లి, వలువ బూచంట, చేదుం
బువ్వంట, చూడంగ నుళుళు
క్కవ్వంట, యరయంగనట్టి హరునకు జే జే,

అను పద్యమును జెప్ప, నుచ్చారణను ననుసరించి మొట్ట మొదటి యక్కఱమునే వ్రాయంజాలక నర్సన గుణింతము సెప్పుకొన నారంభించెను. అప్పుడు రామకృష్ణుండు పక పక నవ్వుచు 'అయ్యా! ఇందులో మీ సామర్థ్యము దెలిసినది. ఇంక నీ పద్యములోని తప్పులు దిద్దుండు,

మ. గనసీహారగు రామపద్మ థళరంగత్కీర్తి చాణూర మ
ర్దన శుక్రాక్షి కళేబరాణ్మృగపతీ త్రైలోక్య దామోదరా
యనంగా శంకరి వాంఛితార్థదగ దాద్యపైకి పాణీజనా
ర్ధన వానేకపవైరి విగ్రహముఖుందా మిత్రవింధాధిపా!

ఇట్టి పద్యమును జదువుకొని నర్సన సామాన్యబుద్ధికిఁ బైకి తప్పులుగాఁ దోఁచు చాణూరమర్దనాది శబ్దంబుల దిద్ది సరిచేసితి నని చెప్పెను. రామకృష్ణుఁడంత బలువట పండ్లుగీటుచు 'పండితులారా! చూచితిరా యాతని పాండిత్యము! తనకు దెలియనివన్నియుఁ దప్పులఁట. దిద్దినాడఁట' యని తొల్లింటి శబ్దంబులంబట్టియే యర్థమును జెప్పి సభ్యులచే నౌననిపించుకొని నరసన్నను జూచి, 'ఓరీ! పరమమూర్ఖుఁడా!

చ. తెలియని వన్ని తప్పులని దిట్టతనాన సభాంతరంబునన్
బలుకఁగ రాదురోరి! పలుమారు పిశాచపుఁ బాడగట్టె నీ
పలికినమాట దుమ్ముపడ భావ్యమెఱుంగక పెద్దలైన వా
రల నిరసింతురా ప్రెగడరాణ్ణరసా! విరసా! తుసా! బుసా!

చ. ఒకనికవిత్వమందెనయు నొప్పులు తప్పులు నాకవిత్వమం
దొకనికి దప్పుపట్టఁ బనియుండదు కాదని తప్పుపట్టినన్
మొకమటు క్రిందుగాఁ దిగిచి మొక్కలు వోవ నినుపకత్తితోఁ
సిక మొదలంటఁగోతు మఱి చెప్పునఁగొట్టుదు మోముదన్నుదున్.

అని కర్ణకఠోరంబుగాఁ దిట్ట నర్సన నోరెత్తలేక పరాభవ భారంబు మోయుటంజేసి తలయు నెత్తలేక యధోముఖుఁడై యవ్వలకుఁ బోయెను. పెద్దనాదులును రామకృష్ణుని ప్రజ్ఞకు మెచ్చిరి కాని పండితదూషణంబునకు మిక్కిలి చింతపడిరి.

రాయల యాస్థానములో ధూర్జటియను నొక మహాకవి గలఁడు. ఇతఁడు నష్టదిగ్గజములలోనివాఁడే. ఈతని కవిత్వము చాల రసవంతముగా నుండుటంబట్టి రాయలు మెచ్చి యొక నాఁడు పండితులఁజూచి తనకుఁగల యభిమానము తెల్లమగునట్లు,

చ. స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేలగల్గెనీ
యతులిత మాధురీమహిమ?

అని ప్రశ్నించునట్లొక సమస్య నిచ్చెను. కాని పండితులెవ్వరు సకారణంబుగ దాని బూరింపజాలరైరి. రాయ లా సమస్యనే ప్రతిదినము సభలో జదువసాగెను. అందుమీఁద రామకృష్ణుండు ధూర్జటి చరిత్ర మెట్టిదో తెలిసికొనఁదలంచి యందందు విచారింప నతఁడొక వేశ్యాలోలుఁడై యున్నట్లతనికి దెలియవచ్చెను. అందలి సత్యమును దనకుఁ దాను బరీక్షించి రూఢిపఱచుకొని, మఱునాఁడు సభ కరుదెంచి, యథాప్రకారముగా రాయలు తన సమస్యను జదివినంతనే,

.... .... హా! తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సం
తత మధురాధరోదిత సుధారసధారల గ్రోలుటం జుమీ!

అని పూరించెను. అందులకు రాయలు పెద్దనాదులు పకపక నవ్విరి. తనగుట్టు బయటఁబడెఁగదా యని ధూర్జటి తల వంచుకొనెను.

కవిగండపెండేరము నందినది మొదలు పెద్దన మిక్కిలి గౌరవపరుఁడయ్యెను. రామకృష్ణునకు మొదటి నుండియుఁ బెద్దనయెడ మిక్కిలి శ్రద్ధాభక్తులు గలవు. అయినప్పటికి నతని కవిత్వమునందుఁ గూడ దప్పు లెన్నవలయు ననియే రామకృష్ణుని తలంపు. ఇట్లుండ నొకప్పు డొక సమస్యను బూర్తిచేయు సందర్భమునఁ బెద్దన 'అమవసనిశి' యనుపదము

నుపయోగించెను. అది యాసాంతముగా నుండకపోవుటంబట్టి రామకృష్ణుం డదియె యదనుగ పెద్దనం జూచి,

క. ఎమిదిని చెపితివి కవితను, వృషితేకయు దెనియు చెపితివో కయితప్పైతె
  బ్బెసయని చెపితివో కపితము, అమువసనిశెయునుచునీవు అలసని పెదనా!

అని యాక్షేపించెను. పాపము! పెద్దనయు మారుమాటాడ లేదు.

ఇట్లు రామకృష్ణుడు ప్రతివండితుని నాక్షేపించుట వలన నితని నెల్లరు పరాభవింపవలయునని వండితులందఱు గట్టి ప్రయత్నములు సేయం జొచ్చిరి. ఈవిషయమున ధూర్జటి మిక్కిలి పట్టుదలతో నుండెను. ఒకనాడు రామకృష్ణుడు ముక్కుతిమ్మన్న ఇంటి కరిగి యటం దుయ్యాలలో నుండ 'తాతా! ఊంటునా' యని పరిహాసపూర్వకముగా నడిగెను. అతడును సరేయనెను. అపుడు రామకృష్ణుడతని మొగము మీంద దుబుక్కున నుమిసెను. ఆ యకార్యమునకు దిమ్మన కోపగించి కాలితోం గట్టిగా దన్నం బాపము! అతని ముందటి వల్లొకటి విరిగెను. రామకృష్ణుం డింటికరుగుదెంచి పల్లు విరిగినట్లు గన్పడకుండ దుప్పికొమ్మను బలుగా రచియించి యందతికించెను. ఈవృత్తాంతము నెట్లో ధూర్జటి గ్రహించి మఱు దినము రామకృష్ణుడు సభకు వచ్చినంతనే రాయల యెదుట నతని బరాభవించుట కిదియే తగిన సమయంబని,

ఉ. ఆ రవి వీరభద్రుు చరణాహతి డుల్లిన బోసినోటికిన్
  నేరడు, రామకృష్ణకవి నేరిచెంబో మన ముక్కుతిమ్మన
  ప్రూరపదాహతిం దెగిన కొక్కెరపంటికి దుప్పికొమ్ము ప
  ల్గా రచియించె నాథ! రవి గాంచనిచోం గవి గాంచు నేకదా!

అని చదువ రాయలు పెద్దనాదులకుఁ గడుపుబ్బ నవ్వించెను. ముక్కు తిమ్మనయు జరిగిన దంతయు సభవారికి వినిపించెను. రామకృష్ణుఁడు తలయెత్తలేక యటనుండుచో సభికులెంకను గేలిసేతురని యవ్వలకుఁ బోయెను. అంతటితోఁ బండితుల కడుపు మంటయుఁ జల్లారెను.

రామకృష్ణుని వినోదములిట్టి వెన్నియే నియుం గలవు. ఇతనికిఁగల వికటకవి యనుపే రితని కవిత్వము నంటఁ గాన రాదు. ఇతఁడు రచించిన గ్రంథములు 1. పాండురంగ మహాత్మ్యము, 2. ఘటికాచల మాహాత్మ్యము, 3. ఉద్భటారాధ్య చరిత్రము. ప్రస్తుతము ప్రచారములోనున్న పాండురంగమాహాత్మ్యము జదివిన పండితులెల్లరుఁ బాండురంగనుకవి పద్యంబు హరువు మెచ్చఁదగినదని కొనియాడినారు. ఇతఁ డన్నివిధములఁ బ్రౌఢకవితా ధురీణుఁడనుట స్తుతివాక్యము కానేరదు. ఇతని కవిత్వము ధారాశుద్ధితోను, పదలాలిత్యములతోను, రసగాంభీర్యముతోను, మనోహర శ్లేషార్థములతోను, సర్వవంతములగు లోకోక్తులతోను, గదనతురంగంబు పదగతితోను, గథాసందర్భంబు ననుసరించి బహువిధ రసపాకంబులతోను నొప్పాచుండును. తొలికృతియగు పాండురంగమాహాత్మ్యము (దీనికి పాండురంగ విజయమను పేరును గలదు.) నితఁడు విరూరి వేదాద్రిమంత్రికి నంకిత మొనర్చెను. ఇతని కృతులు కొద్దిగా నున్నను చాటువులుమాత్రము పెక్కులు గలవు. మొత్తము మీఁద రామకృష్ణుఁడును సుప్రసిద్ధాంధ్రకవి యని చెప్పఁ దగినవాఁడు.

# 7. అయ్యలరాజు రామభద్రుఁడు

ఉత్తరాంధ్ర కవులలో నితఁడు సుప్రసిద్ధుఁడు. తల్లికోట యుద్ధానంతరము జీర్ణవిజయనగర సామ్రాజ్యమును బునరుద్ధరింపఁదలంచి తిరుమలరాయల పెనుగొండలో రాజ్యమును స్థాపించి కొంతవఱకు మహమ్మదీయ ప్రభువుల యలజడి నణంచి పరిపాలించిన విషయము సర్వజన విదితము. ఇతని యనంతర మీరాజ్యము చంద్రగిరికి మార్పఁబడెను. తిరుమలరాయల కాలమునందే యతని తమ్ముఁడైన వేంకటాద్రిరాయులచే నీ చంద్రగిరిదుర్గము పాలింపఁబడుచుండెను. ఈ రెండు రాజ్యములు సమస్త విషయములం దేకీభావము వహించియుండెను. ఈ వేంకటాద్రిఁ సంస్థానమునందే యయ్యలరాజు రామభద్రుఁడు ప్రధాన పండితుఁడుగా నుండెను. తిరుమలరాయని యాస్థానమునందు రామరాజభూషణుఁడు ముఖ్య కవిగా నుండెను. ఈ యిరువురు సమకాలికు లగుటం జేసి యితఁడు క్రీ. శ. పదియాఱవ శతాబ్ద మధ్యభాగమున నున్నవాఁడని తేలుచున్నది.

ఆకాలములో రామరాజభూషణున కున్నంత గౌరవము గాని రాజాభిమానముగాని మఱి యేకవికిని లేదు. అయినప్పటికి నతని కేవిషయమునందును దీసిపోక కత్తి కెదురుకత్తియని ప్రతిఘటించి నిలిచిన పండితవీరుఁ డీ యయ్యలరాజు రామభద్రుఁడే! ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు కౌండిన్యస గోత్రుఁడు.

ఆపస్తంబసూత్రుఁడు. ఇతనితాత తిప్పయ్య యను మాఱు పేరుగల పర్వతరాజు. తండ్రిఅక్కయ్య తల్లి ఎవ్వరో తెలియదు.

ఇతని వంశమువారు మొదటినుండియు వైష్ణవ మతస్థులగుటం జేసి యితఁడును వైష్ణవ మతస్థుఁడే యని యూహింప యగుచున్నది. అదిగాక యితఁడు రచించిన గ్రంథములను విష్ణుకథా౽వయుక్తములై యుండుటంబట్టి యీ విషయము సత్యమని తేలుచున్నది. ఇఁకనీతని గురువు. యితఁడు తన గ్రంథారంభములోఁ జెప్పినపద్యముంబట్టి ముమ్మడి వరదాచార్యుఁడు. ఇతఁడు శ్రీమద్రామానుజమత సిద్ధాంత కోవిదుఁడు;బోధకుఁడు. ఈ గురు పరంపరనుబట్టియు నితఁడు వైష్ణవమత ప్రవిష్టుఁడనుట విశ్వసనీయ మగుచున్నది. అన్నిటికంటె మించి యితఁడు రామ మంత్రోపాసకుఁడై యుండుటంజేసియు నిది పరమ సత్యమగుచున్నది.

ఇతని వంశము మొదటినుండియుఁ బండిత వంశమని పేరుగాంచినది కాని. యితని పూర్వుల కృతు లెవ్వియును నిప్పుడు గానరావు ఇతని జన్మస్థాన మేకశిలానగరమని కొందరు, ఒంటిమెట్టయని మరికొందరుఁ జెప్పుదురు. ఇతని గ్రంథములలోని గద్యనుబట్టి విచారించినచో నొంటిమెట్ట యనియు దేలుచున్నది. ఇతఁడు చిన్నతనమందే శ్రీమదొంటిమెట్ట రఘువీరు పేర నొక శతకమును రచించెను. ఇదియే యితని తొలి కృతి. ఇతని కుటుంబము చాల పెద్దది. ఎక్కువ సంతానముగలవాఁడు. ఇందుచేత నితనికి బిల్లల

రామభద్రయ్య యనియు వ్యవహారనామము గలదు. ఇతఁడు నిరుపేద గావునఁ గుటుంబపోషణ మితనికి బహుభారమయ్యెను. ఎంతకాలమని కుటుంబ భారమును మోయఁగలఁడు! సుఖజీవన మొనర్చుటకుఁ దగిన యాధార మెందును లభింపకపోవుటంజేసి రామభద్రుఁ డింక సంసారము గడపుట కష్టమని సన్యసించి కాశికింబోవ సంకల్పించుకొని యట్టి సన్నాహముతో నుండెను. ఈసమాచార మెట్లో యతని హితుఁ డొకండు దెలిసికొని యతనికడకు వచ్చి "మిత్రుఁడా నీకీ పిచ్చి తగదు. కష్టమని సన్యసించి నంతనే కలుగునా ముక్తి! ఇట్టిది పౌరుషము గాఁజాలదు. నీకున్న పాండిత్యమే నీకు సుఖజీవనము సమకూర్పఁ గలదు. కావున భాషాభిమానముగల నృపతి నేరినైన నాశ్రయింపుము. ఉభయలోక సుఖమున కిది మూలధన" మని హిత ముపదేశించి యతని సంకల్పమును సంపూర్తిగా మార్చెను.

తరువాతఁ గొన్నాళ్ళకు రామభద్రుఁడు చంద్రగిరికిఁ బయనము సాగించి యచిరకాలమునందే యానగరమును బ్రవేశించి యొక సత్రములో బసచేసెను. ఆనాఁటి రాత్రి కొందఱు విద్యార్థు లాసత్రమునకు వచ్చి బసచేసి యొక పద్యమును వ్రాయ సమకట్టి చేతగాక యేమిచేయుదమా యని యాలోచింప సాగిరి. అదియంతయుఁ దిలకించుచున్న రామభద్రుడు వారినిసమీపించి "అయ్యలారా! మీ రాలోచించున దేమి?" యని ప్రశ్నించెను. అందులకు వారును "అయ్యా! మేము మహాకవీశ్వరుఁడని పేరుగాంచి యీరాజాస్థాన

ములో నున్న రామరాజభూషణుని శిష్యులము. ఆయన మమ్ముండజేని విరహిణీ మూర్ఛానంతర వృత్తాంతమును వర్ణింపుఁడని కోరెను. అది చేతఁగాక యెట్లాయని మేమాలో చించుచుంటి” మని తమ సమాచారము నెఱింగింప రామ భద్రుఁడు సంతసించి యది తనకు శుభసూచకముగాఁ గొని “అయ్యలారా! నేనావని నిర్వహించెదను. మీరింతలో నాకు భోజనము సిద్ధముచేయుఁడని చెప్పి తన యసమాన కవితా విశేషము వెల్లడి యగునట్లొక పద్యమును వ్రాసెను.

ఆ పద్యమునుగొనియావిద్యార్థులు రామరాజభూషణుని యొద్దకుఁ బోయిరి. అతఁడును పద్యముం జదివి, యది నిజశిష్య విరచితంబు గాదని గ్రహించినవాఁడై “ఇదిమీరు రచించినది కాదు. ఎవ్వరు రచించిరో నిజము చెప్పుఁ”డని శిష్యుల నడుగ వారు నున్న దున్నట్లు చెప్పిరి. అంత రామరాజభూషణుఁ డతఁ డెవ్వఁడో మహాపండితుఁడై యుండనోపునని తలంచి శిష్యులతోఁగూడి యతనిం జూడనరిగెను. రామభద్రుఁడును దూరమున వారింగాంచి తన యాలోచన సఫలమయ్యెనని యుప్పొంగెను. రామరాజభూషణుఁడును రామభద్రునిఁ జేరి కౌఁగలించుకొని తగినరీతి సంభావించి గౌరవపూర్వకముగా దనయింటికిఁ గొనిపోయెను. అంతఁ గొన్నిదినంబుల కతని సాహాయ్యంబువలన రామభద్రుఁడు వేంకటాద్రి రాయల యాస్థానకవులలో నొకఁడయ్యెను. అంతటితో నతని కష్ట జీవన మంతరించెను.

కాలక్రమమున రామభద్రుఁడు తన పాండిత్య ప్రభావముచేత నాస్థానమునందేగాక యితర ప్రదేశములను మంచి పేరుగాంచెను. ఇది రామరాజభూషణుని యీర్ష్యకుఁ గారణమయ్యెను. తన ప్రాపున నాస్థానప్రవేశము గలిగించుకొన్నవాని కింతటి పేరాయెనని రామరాజభూషణుఁ డనూయాగ్రహములతో నెట్లయిన నతని పరాభవించి తన యౌగ్రత్వమును నిల్పుకొన వలయునని ప్రయత్నింప జొచ్చెను. ఇది రామభద్రునకుఁ జూచాయగా దెలియవచ్చెను. అతఁడును గత్తికెదురు గత్తిగా నిలిచి పేరుగాంచవలయునని యత్నింపనాగెను. ఇట్లుండగా వేంకటాద్రిరాజొకనాఁడు పండితసభ గావించి, రామరాజభూషణుని కవిత్వమును బెక్కుభంగుల శ్లాఘించి యతని కగ్రస్థాన మొసంగెను. అప్పుడు భట్టుమూర్తి రామభద్రునిఁ జూచి "ఓయీ! నీవెంత యత్నించినను నీ వెంతటి పేరు గాంచినను రాయల సభలో నాతో సమానుఁడవు గాఁజాలవు, నీ యత్నమును మానుము" మని నిర్లక్ష్యముగను, బరిహాసపాత్రముగను బల్కి వేంకటాద్రియుఁ దన యంగీకారమును సూచించుటకో యన మౌనము వహించెను. అందులకు రామభద్రుఁ డెంతయుఁ గోపించి వేంకటాద్రింజూచి మహారాజా!

ఉ. పండితులైనవారలు సభాస్థలినుండఁగ, నల్ప డొక్కఁడు
ద్దండత బీఠ మెక్కిన బుధప్రకరంబుల కేమి యొగ్గగున్ ?
కొండొక క్రోతి చెట్టు కొనకొమ్మకు నెక్కిన, గ్రింది మత్త వే
దండమహోగ్ర సింహములు తాలిమి జెందవె ? రాజచంద్రమా !

అని ధిక్కరించి పలికెను. అందులకు రామరాజభూషణుఁ డెంతయుఁ గనలి తన యాసనంబు డిగ్గి "ఓయీ! మాటలతోఁ బని లేదు. నీ వొక గ్రంథమును రచించి తెమ్ము. అందులో నేఁ దప్పు చూపించెదను. చూపలేకున్న నీ పాదంబు నా శిరంబున ధరియింతు. చూపించినచో నా పాదంబు నీశిరంబం దునిచెద. నీ కాఱునెలలు గడువిచ్చితిని. గ్రంథమును రచింపు"మని ప్రతిజ్ఞావచనంబులు పలుక రామభద్రుఁడును సరేయనెను. అప్పుడా సభయందే యున్న తిరుమలరాయుని మేనల్లుఁడు గొబ్బూరి నరసరాజు రామభద్రునిఁ జూచి "అయ్యా! మీరు రచింపం బోవు నీ ప్రతిజ్ఞాగ్రంథమును నా కంకిత మొనర్పుఁ"డని కోరి కర్పూర తాంబూలాదు లిచ్చి యితనినిఁ బూజించెను.

రామభద్రుఁడు గృహంబున కరిగి ప్రతిజ్ఞాభంగము తనకు గలుగకుండ దన యిష్టదైవంబగు శ్రీరామచంద్రు నుపాసించి యేమి గ్రంథము వ్రాయుదునా యని విచారింపఁ జొచ్చెను. ఆనాటి రాత్రి శ్రీరామచంద్రుఁ డతనికి స్వప్నంబున సాక్షాత్కరించి తన జన్మకథను ప్రబంధముగా రచించునది యనియు నిజకృపాబలంబున నతనికి జయంబు సమకూఱు ననియుఁ జెప్పినట్లయ్యెను. అంత మహాప్రసాదంబని రామభద్రుఁడును శుభముహూర్తంబున రామాభ్యుదయ మను నొక మహాప్రబంధమును వ్రాయ నారంభించెను. ఇటు భట్టుమూర్తియు (రామరాజభూషణునకుఁ గల మాఱుపేరు) రామభద్రుని గ్రంథ రచనంబుఁగూర్చి తెలిసికొనినవాఁడై తనకు జయంబు సమకూర్పునదియని యిష్టదైవంబగు పవమానతనయు

నుపాసింపఁ జొచ్చెను. ఇంతలో నాఱు నెలలు నిండఁ బ్రతిజ్ఞ మేరకు రామభద్రుఁడు గ్రంథమును ముగించి సభకుఁగొని వచ్చెను.

ఆ నాఁడు పండితసభ కన్నులపండువుగా నుండెను. ఎవరి కోటమిగల్గునో యని సభికులు తహతహపడజొచ్చిరి. రామభద్రుఁడు రాజునానతిగొని పండితుల యెదుటఁ దన గ్రంథమును జదువ నారంభించెను. భట్టుమూర్తి తప్పెచటఁ గన్పడునా యని కతినపూర్వకంబుగ వినుచుండెను. ఇంతలో నరణ్యవర్ణనముఁ గూర్చిన యొక పద్యమును రామభద్రుఁడు చదువఁగ వినినంతనే భట్టుమూర్తి యాగుమది యని 'ఓయీ! ఈ వర్ణనయందు దప్పున్నది. భిల్లకన్యల గీతికలు విని పాములు పాఱిపోయినట్లు వర్ణించితివి. ఎక్కడనైనఁ బాములు పాటకు మెచ్చి పడగలు విప్పి యాడునే కాని పాఱిపోవునా? కావున నిది దోషము. ఇకఁ బ్రతిజ్ఞావచనంబును బాలింపు' మని పలుక రామభద్రుఁడును "అయ్యా! నీ చెప్పినది యొప్పే కాని భిల్ల కన్యలు షడ్జస్వనము మీఁదఁ బాడిరి. షడ్జస్వనము నెమలి కూఁతతో నుపమింపఁబడును. కావునఁ బాములు కేకికేంకార మను భ్రమపూర్వక భయంబునకు లోనై పాఱిపోయినవి. మయూరము లన్న సర్పములకు భయముగదా?" యని యాతప్పు నొప్పుగా వివరించెను. సభికులెల్లరు రామభద్రుని యర్థమే లెస్స యనిరి. అప్పుడు భట్టుమూర్తియుఁ దన తప్పు నొప్పుకొని ప్రతిజ్ఞాప్రకారము తనశిరముపఁ బాదంబునుంచునది యని రామభద్రునిఁ గోరెను. కాని యతఁ డసూయలేని

పండితుఁడు గావున మహాకవియై భట్టుమూర్తియెడ నిట్టి యకార్యమును గావింపక మన్నించెను. ఇందులకుఁ బ్రతిఫలముగా భట్టుమూర్తి రామభద్రునిఁ గౌఁగలించుకొని యతఁ డన్నివిధ ముల దనతో సమానుఁడని సభికులయెదుటఁ బలికి యందులకు బ్రత్యక్ష నిదర్శనముగా నతనిఁ తన యున్నతాసనమునఁ గూర్చుండజేసెను. రాజును, సభవారును నా యిరువురు కవి పుంగవులం బెక్కు తెఱంగులఁ గొనియాడిరి.

రామభద్రుని కవిత్వాదులెట్టివో యీ పై విషయము వలనఁ దెల్లమగుచునే యున్నవి. ఇతఁడు పెద్దనాదులకుఁబలెఁ గల్పనాంశముల మిపులఁ బ్రసిద్ధుఁడు. ఇతని కవితారచన జటిల పదభూయిష్ఠమై దీర్ఘసమాసములతోను, వర్ణనాంశములవట్ల నన్వయ కాఠిన్యముతోను నలరారుచున్నప్పటికి మృదుతర మనియే చెప్పఁదగియున్నది. ఊహా ప్రపంచములోఁ జిక్కిన భావములఁ గూర్చి లలితపద ప్రయోగములతో నర్థమును బొడిగించి వర్ణనాంశముల నితఁడు మనోహరముగాఁ జిత్రింపఁ గలఁడు. ఇతఁడు రచించిన గ్రంథములు— 1. ఒంటిమిట్ట రఘు వీరశతకము, 2 రామాభ్యుదయము. రామాభ్యుదయము గొబ్బూరి నరసరాజున కంకిత మొనర్పఁబడినది. ఇతఁడు రచించిన మరికొన్ని యితర చాటువులు గలవని చెప్పుదురు. కాని యిప్పుడవి మనకు లభించుటలేదు.

# 8. అడిదము సూరకవి

ఉత్తరాంధ్రకవులలో సూరకవియుఁ బేరెన్నికఁ గన్న వాఁడు. ఇతఁడు పూర్వకవులయట్లు తిట్టుకవిత్వమునందు దిట్ట. ఇతని చాటువులఁబట్టి విచారించినచో నితఁడు వాక్సుద్ధి గలవాఁడని తేలుచున్నది. మహాకవులగువారి కేదోయొక దేవతోపాసనా బలముండుననుట నిర్వివాదాంశము. అట్లనే సూరకవికిఁగూడ నుపాసనాబల ముండితీరవలయును. కాని యా దేవత యెట్టిదో చక్కగా బోధపడుటలేదు. అయినను నీతని విరచితంబగు రామలింగేశ శతకమునుబట్టి యూహించినచో నితఁడు రామచంద్రపురమున వేంచేసియున్న రామలింగేశ్వరస్వామి భక్తుఁడనియు నమ్మహాదేవుని కృపాబలమే యితని కవిత్వమునకు మూలాధార మనియుఁ దేలుచున్నది. ఇతఁడు తన కృతుల నన్నింటిని భగవదంకిత మొనర్చుటంబట్టి యితని కాలనిర్ణయమున కవి యేమాత్రమును దోడుపడుటలేదు. కాని చాటువులంబట్టి విచారించినచో నితఁడు విజయనగర సంస్థానమును బాలించిన చిన విజయరామరాజుగారి కాలములోని వాఁడని ధృవపడుచున్నది. దీనిని బట్టి సూరకవి పెదవిజయరామరాజుగారి కాలమున బాల్యదశలో నుండి చినవిజయరామరాజుగారి కాలమున విజయనగర సంస్థాన కవియై విరాజిల్లి దాదాపు ౧౮-వ శతాబ్దాంతము వఱకు జీవించి యుండెనని తేలుచున్నది. మఱియుఁ జిన విజయరామరాజుగారి సమకాలి

కులును పెద్దాపుర సంస్థానాధిపతులును నగు శ్రీవత్సవాయ తిమ్మగజపతి మహారాజుగారి చరిత్రను బట్టియు నీ కాలనిర్ణయము యదార్థమగుచున్నది.

ఈ మహాకవి నియోగి బ్రాహ్మణుఁడు. అడిదము బాల భాస్కరుని పుత్రుఁడు. ఇతని నివాసస్థలము గోదావరీ మండలములోని చీపురుపల్లె యను గ్రామము. ఇతని ఇంటిపేరు బిరుదు నామమేగాని యూరు పేరిట వచ్చినదికాదు. ఇతని పూర్వులలో నొకఁడు కత్తియుద్ధమునం దద్వితీయుఁడై పేరుగాంచిన కారణమున నతని పేరిట నడిదము వారని వ్యవహారనామము గల్గినట్లు కొందఱు చెప్పుదురు. మొత్తముమీఁద నితని యింటి పేరు బిరుదనామమనుటలో సందియము లేదు, మొదటినుండియు నితని వంశము పండిత వంశమని పేరుగాంచినది. ఇతని తండ్రి యగు భాస్కరుఁడు శుద్ధాంధ్ర రామాయణము రచించెను. కాని యిప్పుడీ గ్రంథము ప్రచారములో లేదు.

ఇట్టి మహాప్రభావ సంపన్నుఁడగు సూరకవి మిక్కిలి దరిద్రుఁడు. సరస్వతీకటాక్ష మున్నచోట లక్ష్మీకటాక్ష ముండ దనుట యెల్లరకుఁ దెలిసిన విషయమే. కావున సూరకవి తన విద్యాబలంబున దరిద్రదేవతాబలంబును గూలుపం దలంచి స్వగ్రామంబు విడిచి విజయనగర సంస్థానంబునకుంజని యచిర కాలంబునంద రాజానుగ్రహంబునకుఁ బాత్రుఁడై తదాస్థాన కవి యయ్యెను. అంతటితో నతనికి సుఖజీవన మేర్పడెను. చినవిజయరామరాజుగారు భాషాభిమానులు గనుక సూరకవిని

మిక్కిలిగా నాదరింపఁ జొచ్చిరి. కాని తదాస్థాన మంత్రులును విజయరామ రాజుగారి సవతితల్లిగారును నగు సీతారామ రాజుగారు రాజ్యాధికారము సంతయుఁ జెలాయించువారు గనుక నాయనకు మాత్రము పండితపోషణము నచ్చలేదు. ఇట్టిదంతయు దుర్వ్యయమనియే యాయన తలంపు. అయిన ప్పటికిఁ దన యభిప్రాయమును బైకిఁ దోపనీయక తగిన సమయమునకై వేచియుండెను. నూరకవి సీతారామరాజు గారికిఁ గల యభిప్రాయము నెట్లో గ్రహించి తగినట్లు బుద్ధిసెప్పుటకై యెదురు చూచుచుండెను.

ఒకప్పుడు విజయరామ నృపాలుఁడు సీతారామరాజు తోను, నూరకవితోను, మరికొందరు రాజకీయోద్యోగుల తోను పెద్దాపుర సంస్థానమున కరిగెను. అచ్చటఁ దిమ్మజగపతి మహారాజుగారి యాజమాన్యమున నొక గొప్ప సభ జరిగెను. ఆ సభలో నూరకవి తనకుఁగల రాజాభిమానము ప్రకటితమగున ట్లీ పద్యమును జదివెను.

ఉ. రాజు కళంకమూర్తి, రతిరాజు శరీరవిహీనుఁ, డంబికా
రాజు దిగంబరుండు, మృగరాజు గుహాంతరసీమవర్తి, వి
భ్రాజిత పూసపాడ్విజయరామ నృపాలుఁడె రాజుగాక; యీ
రాజులు రాజులే పెనుతరాజులు గాక ధరాతలంబునన్.

ఈ పద్యమును జదివినంతనే సీతారామరాజు మొదలగువా రందరు నూరకవి తమ్ముద్దేశించియే యిట్లు పలికినాఁడని భావించి క్రోధోద్దీపితమానసులై కత్తులు దూయ నూరకవియు భయపడక "యీ రాజులనఁగా బద్యములోఁ బేర్కొనంబడిన

రాజులే” యని సమాధానము చెప్పి వారిని శాంతచిత్తులుగాఁ జేసెను. కాని సీతారామరాజు మాత్రము శాంతింపక నూరకవిపై గోపము వహించి యప్పటికి మాత్ర మూరకుండెను.

అటనుండి విజయనగరమునకుఁ దిరిగివచ్చిన తరువాత నింగ్లీషు వారి సాహాయ్యమున సీతారామరాజే సర్వాధికారి యయ్యెను. విజయరామరాజు పేరునకు మాత్రమే రాజుగా నుండెను. ఇట్లు సర్వాధికారియైన సీతారామరాజు మొట్ట మొదటనే నూరకవిని నాస్థానమునుండి తొలఁగించి విజయ రామరాజతని కొసంగిన మాన్యములన్నిఁటిని లాగుకొనెను. వెండియు మసీదులకు దేవాలయములకు బ్రాహ్మణులకు నియ్యఁబడిన భూములనుగూఁడ నితం డాక్రమించుకొనెను. ప్రజలకు లేనిపోని పన్నులు విధించెను. భూమిశిస్తును బెంచెను. ఈ విధముగాఁ బరిపాలనాక్రమమును దారుమారు చేసి సీతా రామరాజు జనకంటకుఁడయ్యెను. అన్నిఁటికి జాలినవాఁడు గనుక ఎవరైనఁ దిరుగఁబడినచో నట్టివారల నణచియో, ద్రవ్య రూపమున లోఁగొనియో, యెదురులేక వర్తించుచుండెను. పాపము ! నూరకవి యిప్పుడు తిరిగి కష్టములకు లోనయ్యెను. తనకష్టములకేగాక ప్రజలకష్టములకుఁగూడ నితఁడు దుఃఖపడెను. కడుపుమంటకుఁ దాళలేక రామలింగేశశతక మను నొక చిన్న గ్రంథమును రచించి యప్పటి పరిపాలకుల దూషించెను.

సీతారామరాజుగారిచే నాస్థానమునుండి తొలగింపఁబడి నప్పటినుండియు నూరకవి తన గ్రామమునందే నివసించు

చుండెను. అప్పటిలో నితఁ డనుభవించు దారిద్ర్య మింతింత యని వ్రాయలేము. పాపము విస్తరాకులు గొనుటకుగూడ రాగిడబ్బులేనివాఁడు. ఒకనాఁ డితఁ డూరిబయలు నున్న వనస చెట్టెక్కి విస్తళ్ళకై యాకులు గోసికొనుచుండెను. ఆ సమయమున సీతారామరాజు తన కెదురు తిరిగిన బాడుల్లా ఖానను నొక తురక సర్దారుమీఁదికి దండెత్తిపోయి యతనిచే నోడింపఁబడి హతశేషులగు భటులతోఁ దిరిగి వచ్చుచుండెను. ఈ వృత్తాంత మొక భటునివలన సూరకవి తెలిసికొని యతని దుష్టత్వమునకుఁ గ్రుద్ధుఁడై యున్నవాఁడు గావున గసిదీరునట్లెదురుగా,

తే. మెత్తనై యున్న యరటాకు మీఁదఁ గాక
మంటమీఁదనుఁ జెల్లునే మంటివాఁడి;
బీదలై యున్న మాబోంట్ల మీఁదఁ గాక
కలదె క్రొవ్వాడి బాడుల్లఖాను మీఁద.

అని దెప్పిపొడిచి యవమానించెను. పాపము! సీతారామరాజు పరాజయభారముననే గాక యవమానభారము గూడఁ దల దాల్చి భారద్వయంబునఁ దలయెత్తజాలనట్లు గ్రిందుసూచుచు ముందున కరిగెను. సూరకవికిఁ గొంత వఱకుఁ గోపము శమించెను.

ఆయూరిలో సూరకవికిఁ బూర్వార్జితమగు కొన్ని యెకరముల రేగమాన్యము గలదు. ఇదియే యితనికిఁ బ్రస్తుత జీవనాధారము. ఆ గ్రామమును దంతలూరి యన్నమరాజను వాఁడు సర్వాధికారములతో గుత్తకుఁగొని నిర్హేతుకముగా

నూరకవితో విరోధించి యూరిని రేవకాన్వ్యాపము నుండి మాటికి నీరును బయటికిఁ బోనీక యడ్డుకట్టి చిక్కుపెట్ట సాగెను. ఇట్లొనర్చుట తగదని నూరకవి యెంతగనో చెప్పెను. గ్రామస్థులు కూడ నట్లు చేయుట తగవు కాదనిరి. కాని యన్నమరాజు వారి మాటలను లక్ష్యపెట్టక వగసాధింప నెంచెను. ఇతనితో నేమని నూరకవి పై యధికారులకుఁ దెలుప వారును మిన్నకుండిరి. అప్పుడు నూరకవి కడుంగడు నాగ్రహించి పొలమునకుఁ బోయి మొలలోతు నీళ్ళలో నిలుచుండి గంగాదేవినిఁ గూర్చి ప్రార్థించెను.

పెక్కు తెఱంగులఁ బ్రార్థింపఁ బొలములోనినీరంతయు గట్లు త్రెంచుకొని బయటికిఁ బోయెను. ఈ యద్భుతకార్యమునకు నాయూరి ప్రజలేగాక యన్నమరాజు మొదలగు నధికారులును నాశ్చర్యపడి నూరకవి మహిమను గొనియాడిరి. వెండియు నన్నమరాజు మహాకవులతో విరోధము తగదని బుద్ధి తెచ్చుకొని నూరకవితో స్నేహమొనర్చి యతని యనుగ్రహమునకుఁ బాత్రుఁ డయ్యెను.

నాఁటినుండి నూరకవి యెడఁ బ్రజలు మహా గౌరవమును జూపుచు నతని కొకవిధముగా సుఖజీవనమును గలిగించిరి. అందువలన నెట్టి తొందరయు లేనివాఁడై యీ మహాకవి తన జీవితశేషమును గ్రంథరచనమునకుఁ వినియోగించెను. ఇతఁడు రచించిన గ్రంథములు 1, కవిజనరంజనము, 2. రామలింగేశ్వర శతకము, 3. కవిసంశయ విచ్ఛేదము, 4. ఆంధ్ర

ములఁ దన కృతులయందును వాడినాఁడు. ఒక విధముగా ఇతఁడు స్వతంత్రకవి యగుచున్నాఁడు. ఇతఁడు రచించిన గ్రంథములు కొద్దిసంఖ్య గలవిగా నున్నను చాటువులు మాత్రము బహుళముగా నున్నవి. ఈ చాటువులలో నెల్లఁ బొనుగుపాటి వేంకటమంత్రిమీఁదఁ జెప్పిన పద్యములు మాత్రము ముఖ్యములు. ఇవి యన్నియుఁ జాటుపద్య మణిమంజరిలో సంగ్రహింపఁబడి యున్నవి.

# 9. కూచిమంచి జగ్గకవి

మహాకవుల చరిత్రలు లతి విచిత్రములు. ఉపాసనా బలము చేతను, శేషదత్త వరప్రసాద మహిమ చేతను, స్వయం కృషి చేతను మహాపండితులైనవారు మన తెలుఁగు కవులలోఁ బెక్కుమంది కలరు. అట్టివారిలోఁ గూచిమంచి జగ్గకవి యొకఁడు. ఇతని పట్టుదలయే ఇతని మహోన్నతదశకు మూలాధారము. బహుళ ప్రబంధకర్తయుఁ, గవిసార్వభౌముఁడు, శివార్చన కళాపారీణుఁడు నగు కూచిమంచి తిమ్మనకవి యితని యగ్రజుఁడు. జగ్గకవి యారువేలనియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యస గోత్రుఁడు, తిమ్మయామాత్యుని పౌత్రుఁడు. గంగనామాత్యుని పుత్రుఁడు. ఇతనితల్లి లచ్చమాంబ, అన్న తిమ్మకవి, తమ్ముఁడు సూరన. ఇతని జన్మస్థానము గోదావరీ మండలములోని కందరాడ గ్రామము. ఈ గ్రామ కరణీకము వీరికుటుంబమునకే చెందియున్నది. జగ్గకవి జన్మకాలము చక్కగాఁ దెలియుటలేదు. కాని యన్నయైన తిమ్మకవినిఁబట్టి యితఁడు క్రీ. శ. ౧౭౦౦ వ సంవత్సర ప్రాంతమున జీవించియున్నట్లు రూఢి యగుచున్నది.

జగ్గకవి మొదటినుండియు స్వేచ్ఛావిహారి. బాల్యమునందితఁడు విద్యనభ్యసింపక తుంటరి బాలురతోఁ గలిసి యిచ్ఛ వచ్చినట్లు తిరుగుచుండెడివాఁడు. దీనికిఁ దోడితఁడు ముక్కోపి. అందుచేతఁ దండ్రిగాని యన్నగాని యితనిని మందలింపక యిష్టమైనట్లు తిరుగనిచ్చెడివారు. పెద్దల యాజ్ఞ లేనప్పుడు

పిల్లలఁగూర్చి యిఁక నేమి చెప్పవలెనా? భాగ్యమునఁ బ్రతివానికి విద్యయున్న [illegible] సత్యము. అందులోఁ గూడను గడ్డపు [illegible] చేసితే యుండదు. తండ్రి కరణమై యుండుటచేతను, నన్నగారు పీఠికాపురసంస్థానములోఁ బండితుఁడై యుండుటచేత, జగ్గకవి కేలోపమును లేకుండెను. ఈ విధముగా షోడశ వత్సరప్రాయుం డగువఱకు నితఁడు నిరక్షరకుక్షిగా నుండెను. మొదటినుండియు నితని కుటుంబము మంచి పేరుతో నుండుటంబట్టి, [illegible] దిమ్మకవి యాస్థాన పండితుఁడై యుండుటంబట్టి, జగ్గకవికిఁ బదునెనిమిదవ యేట వివాహ మయ్యెను. ఇతఁడు విద్యాశూన్యుఁడని మొట్టమొదట మామగారికి దెలియదు. [illegible] కరిగినప్పు డితని బండారము బయటఁబడెను.

మామగారు గొప్ప విద్వాంసుఁడుగనుక యల్లుని విద్యావిహీనతకు మిక్కిలి నొచ్చుకొని 'అయ్యో! నా తొమ్మండ్రు కూతులను కుక్కలను జంపుకొని తిను కొయ్యలకే యిచ్చితి' నని బంధుల యెదుట వాపోయెను. జగ్గకవి యా మాటలు విని యంతవఱకు నొకరిచేత మాటఁబడని వాఁడు గనుక మహోగ్రహావేశమున 'మామా! విద్య లేదనిగదా నన్నిట్లు దూలనాడితివి? ఇదిగో! చెప్పుచున్నాను వినుము, నేనెప్పుడు మహాపండితుఁడ నగుదునో యప్పుడే నీ యింటికి వచ్చెదను. అంతవఱకు నీ మొగము చూడ' నని ప్రతిజ్ఞావచనంబులు పల్కి యప్పుడే బయలుదేరి పోయెను.

జగ్గకవి యువకగానమును ధరించువాఁడు కాఁడు. మఱియు మాట వచ్చినప్పుడు కలిగి శక్తి యద్ది తీయకుము. అట్లు దేశాంతర గతుండైన యితండు మంగళగిరికిఁ బోయి వేంకటాచార్యులను సుప్రసిద్ధ పండితుని శిష్యుండై యింటి యొద్దనే విద్యనారంభించెను. వేంకటాచార్యులును విద్యాభ్యాసము నందుఁగల వట్టుదలను మెచ్చి బహుశ్రద్ధతోఁ జెప్పసాగెను. ఇట్లు ఎడతెగని కృషివలన బదిపండ్రెండు సంవత్సరములలో జగ్గకవి భాషలయందు గొప్ప పాండిత్యము గడించుటే గాక ఛందోవ్యాకరణాది శాస్త్రములుకూడ నభ్యసించి మహాకవి యయ్యెను. ఈ గురుకులవాసము కారణంబుగ నితఁడు వైష్ణవమతస్థుఁ డయ్యెను. అయినప్పటికిని శివకేశవులయం దభేదబుద్ధి గలవాఁడు. శివమతస్థుఁడగు నన్నయెడ నితని కెంతో గౌరవము కలదు.

ఇట్లు పండితకవియైన జగ్గన రెట్టించినయుత్సాహముతోఁ బీఠికాపుర సంస్థానమునకరిగి యచ్చటఁ దన ప్రతిభావిశేషముల బ్రదర్శించి యన్నగారి మహానుగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను. అప్పటి పీఠికాపుర సంస్థాన ప్రభువగు రావుమాధవ నృపతి యితని నెంతో గౌరవించి తిమ్మకవితోఁ బాటితని కూడఁ దన యాస్థానకవిగా నొనర్చెను. అల్లుని ప్రతిభా విశేషములు వినికిడివలనఁ దెలిసికొని జగ్గన మామగారు రతులితో త్సాహంబునఁ దిమ్మకవి గృహమునకరుదెంచి యల్లునిఁజూచి "నాయనా! ఆనాఁడేదో తెలియక నిన్నుఁ దూలనాడితిని, ఇంక నైన నా గృహమునకు రమ్ము. భార్యను స్వీకరింపు" మని

పలుక జగ్గనయు మహావినయముతో మామగారి యడుగులంబడి మ్రొక్కి లేచి "మామా! నీ వాక్యమే నన్నింతవానిగా నొనర్చినది. పెద్దలు కోపించుట పిన్నల శ్రేయమునకే గాని హానికింగాదు. ఖేదమువద" యని యప్పుడే మామగారితోఁ గలసి వారియూరి కరిగెను.

జగ్గన యిప్పుడు కుటుంబీకుఁ డయ్యెను. ఇంతలోఁదిమ్మ కవికి జాయావియోగము సంభవింప నతని పోషణభార మంతయు జగ్గకవిమీఁదనే పడెను. తమ్ముఁడగు నూరనయు గొప్పస్థితిలో నున్నప్పటికిని నతని భార్యకుఁ బొరుగు గిట్టదు. కనుక తిమ్మకవి కుటుంబపోషణమును కూర్చి యతఁడు జోక్యము కలిగించుకొనలేదు. రెండు కుటుంబములను బోషించుటకు మిక్కిలి ధనముకావలసియున్న కారణమున జగ్గకవి ధనార్జనమునకై నానా సంస్థానాధిపతుల దర్శింపబోచ్చెను. తిమ్మకవి యింటనేయుండి జాయావియోగశోకంబున విరక్తుడై తన జీవిత శేషమును గ్రంథరచనకే వినియోగించెను. జగ్గన పెక్కుసంస్థానముల కరిగి నిజకవితా సుధారసంబున నాయా ప్రభువుల సంతృప్తుల గావించి యపరిమిత ధనంబులఁ బడయుచుండెను.

ఒకప్పుడు విజయనగర సంస్థానమున కరుగగనే తత్ప్రభువగు విజయరామరాజుగారితనినిఁ బెక్కువిధముల సత్కరించి యితని కవితా విశేషంబుల కలరి "కవిగండ" యను బిరుదు లొసంగి గౌరవించిరి. ఈ మహారాజుగారి చెల్లెలి పెనిమిటి యగు నీలాద్రిరాజుగారు జగ్గకవి ప్రతిభావిశేషంబులకుఁ మెచ్చి

తన గృహంబునకుఁ గొనిపోయి ప్రత్యేక బహుమానంబుల సత్కరించి "కవిపుంగవా! చిరకాలము నుండియు నాకొక్క కోర్కెగలదు. అది మీరు తీర్పవలయు. నా యుంపుడుగత్తె యగు చంద్రరేఖను నన్నును నాయికా నాయకులుగ నొనర్చి యొక్క శృంగార ప్రబంధమును రచింపుము. ఇందుకుఁ దగిన సత్కారంబును బహుళంబుగాఁ బడయఁగల"రని కోర జగ్గకవి తనయట్టివాని కట్టి రచన తగనిదైనప్పటికి ధనమువీఁదఁ యాసంజేసి యట్లే రచించుటకు సమ్మతించి తాంబూలంబుఁ గొని స్వగృహమునకుఁ జని చంద్రరేఖావిలాపం బనుపేర నొక మహా ప్రబంధమును వ్రాయఁదొడఁగెను. తనకోర్కె నేఁటికి గదా ఫలించెనని నీలాద్రిరాజు సంతోషించెను. ఈ వృత్తాంత మెట్లో తదాస్థాన పండితుఁడగు ఆడిమెళ్ళ వేంకటశాస్త్రి తెలిసికొని యదివరకే జగ్గకవికిఁ గలిగిన రాజసన్మాన గౌరవముల కీర్ష్యాపరవశుఁడై యున్నవాఁడు గావున నీలాద్రిరాజుం జేరి "మహాప్రభూ! మీయట్టివారల నాయకునిఁగా నొనర్చి తెలుఁగున రచించుట యంతగౌరవము గాదు. సంస్కృతమున రచించినచో నది పండితాదరణమునకు పాత్రమై చిరస్థాయిగా నుండఁగలదు. ముదలయిచ్చితిరేని నేనా కార్యమును నిర్వహింపఁగల" నని పెక్కు తెఱంగుల బోధింప నీలాద్రిరాజందులకు సమ్మతించి యతనినే రచింపు మనెను. ఈ సమాచార మెరుఁగక యిట జగ్గకవి మిగులఁ గష్టించి కొన్ని నెలలలో గ్రంథమును ముగించి నీలాద్రిరాజు కడ కరుగ నతఁడు వేంకటశాస్త్రి ప్రోత్సాహముచేతఁ గృతినందు

టకు నిరాకరించెను. అంతమీఁద జగ్గకవి ప్రశంసా కాలరుద్రుని వలెఁ గోపఘూర్ణిత మానసుఁడై కష్టపడి రచించిన యా యుత్తమ గ్రంథము నచ్చటనే ముక్కలు ముక్కలుగాఁ జించి వైచి పరాభవ ప్రతీకారంబునకుఁ గాను చంద్రరేఖావిలాపం బను నొక బూతు పుస్తకమును రచించెను. గ్రంథము ముగి సిన తరువాత నితఁడు నిజాము రాజ్యమునకు బోయి ప్రధా నాధికారు లగు తురకదొరలకుఁ దానిఁ బద్యములను చెప్పి వారి మెప్పు వడసి తన్మూలమున నవాబును సందర్శించెను. ఆయన యతనిఁ దన్ను సత్కరించి గౌరవింప జగ్గకవి నవాబు మీఁద గొన్ని పద్యములు చెప్పి 'మహాప్రభూ ! నే నొక గ్రంథ మును రచించితిని. దానిని విజయరామరాజు గారి సభలో నీలాద్రిరాజుగారి యెదుట జదివించున ట్లుత్తరువు దయచేయవలసిన' దని కోర నవాబట్లే యుత్తరువు నొసం గెను. ఆయుత్తరువును గొని జగ్గకవి విజయరామరాజుగారి సభ కరిగి నీలాద్రిరాజుగారి యెదుట తనబూతు గ్రంథమును తుదివఱకుఁ జదివెను. ఆ యవమానమును దాళ లేక నీలాద్రిరాజు కత్తితోఁ బొడిచికొని మరణించెను. అతని రక్త ముతో జగ్గకవి పరాభవాగ్ని చల్లారెను. ఈ కథ యెంతవఱకు నిజమో చెప్పలేముగాని గ్రంథము రచించెననుట, సభలోఁ జదివెననుట మాత్రము వాస్తవములే. నీలాద్రిరాజు మరణ మున కితఁడు గ్రంథారంభమునఁ జేసిన యాశీర్వాదమే ప్రబల కారణమని కొందరు చెప్పుదురు. ఆ యాశీర్వాద మిది.

శా. శ్రీకంఠుండు భుజంగభూషణుఁడు భస్మీభూతపంచాస్త్రుఁ డ
స్తోకాటోప బలప్రతాప పురరక్షోవక్ష సంశిక్షణుం
డాకాశోజ్జ్వల కేశపాశుఁడు త్రికాలాంతకుండు రుద్రుండు దా
వీఁకం జింతలపాటి నీలనృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్.

ఉత్తరాంధ్ర కవులలో సరసకవిత్వమునందు జగ్గకవి మొట్ట మొదటివాఁడు గాకున్నను దిట్టుకవిత్వమునందు మాత్రము మొట్టమొదటివాఁ డగుచున్నాఁడు. అధునికులలో బూతు కవిత్వము జెప్పినవారే లేరు. చంద్రరేఖావిలాపమునం దితఁడు చేసిన కవిస్తుతియు నీ విషయమును బలపఱచుచున్నది. అదెట్టిదనిన,

కం. భీమకవి రామలింగని, శ్రీమంతుండై వెలుంగు శ్రీనాథకవిన్
రామకవి ముఖ్యులను బ్రో, ద్దామగతిన్ జిత్తవీథిఁ దలచి కడంకన్.

ఈ పద్యమునందుఁ బేర్కొనఁబడిన వారందఱుఁ దిట్టుకవిత్వమును జెప్పినవారే. వెండియు నిట్టి కవిస్తుతి యొనర్చుటేగాక తన్నుఁగూర్చి,

అష్టవమేఘులం గల మహాకవికోటులలోన బూతులం, బూర్ణుఁడ....

నని గొప్పగాఁ జెప్పికొనినాఁడు. తిట్టుకవిత్వమునం దితఁ డెంత గట్టివాఁడో సరసకవిత్వమునందును నట్టివాఁడే ఇతఁడు రచించిన గ్రంథములు 1. జానకీపరిణయము, 2. నర్మదాపరిణయము, 3. రాధాకృష్ణచరిత్ర (ద్విపద) 4. సుభద్రాపరిణయము, 5. శతకములు, 6. దండకములు, 7. చాటుప్రబంధములు, 8. చంద్రరేఖావిలాపము, 9. సోమదేవరాజీయము, 10. పార్వతీ

పరిణయము. ఇంకను గద్యాలు, రగడలు, మంజరులు, గీతప్రబంధములు ఖడ్గాదిబంధములు రచించినట్లీతని మనుమఁడగు వేంకటరాయకవి పేర్కొని యున్నాఁడు. ఇతఁడు తన గ్రంథముల నన్నింటి బురుషోత్తమ క్షేత్రపతి యైన జగన్నాయకస్వామి కంకిత మొనర్చినాఁడు. పెద్దనాదులకుంబలె నితఁడును ప్రబంధ కవితామార్గమునే యనుసరించినప్పటికి జంద్రరేఖావిలాపము నందుమాత్రముస్వతంత్రుఁడగుచున్నాఁడు. ఈ గ్రంథమునందుఁ బూర్వకవులెల్లరును, పోషించనట్టి హాస్యరసమును ప్రధానముగాఁ బోషించి స్వతంత్రకవితా విలాసమును వెల్లడించినాఁడు. ఇతని కవిత్వమునందు నాచన సోమన, పోతన మొదలగువారి పోకడలు గలవు. అనుప్రాసాలంకారమునం దితనికిఁ మక్కువ యెక్కువ. పెద్దనవలె నచ్చటచ్చట సంస్కృతపద జటిలంబుగాఁ బద్యములను వ్రాయఁగలఁడు. ఇతని కవితాశక్తిఁ బరీక్షింపవలయునన్న సుభద్రా పరిణయముఁ జదువవలెను.

# 10. తరిగొండ వెంకమ్మ

వంగదేశ స్త్రీలలోవలె నాంధ్రదేశ స్త్రీలలో గ్రంథములు రచించినవారు పెక్కుమంది గానరారు. ఉన్నవారిలోను బద్యకావ్యములు రచించినవారు కడు కొద్దిమంది. మనకుం దెలిసినంతలో మొల్ల, మోహనాంగి, ముద్దుపళని, తరిగొండ వెంకమ్మ వీరునలువురుమాత్రము కనంబడుచున్నారు. మొల్ల రచించిన రామాయణమును గూర్చి ప్రతివారికిం దెలియును. కావున నామెకవితావిశేషములంగూర్చి వ్రాయు టనవసరము. మోహనాంగి మారీచివరిణయము మను నొక గ్రంథమును రచించినట్లు చెప్పుదురుగాని యీ పుస్తక మిప్పు డెచ్చటను గానరాదు.

ముద్దుపళని రాధికాసాంత్వనమను నొక శృంగార ప్రబంధమును రచించెను. స్త్రీ స్వభావానుగుణము లయిన లోకోక్తులతోం గూడి కవిత్వమంతయు రసవంత మగుచున్నది. నీమె కవితాశక్తి చాల మెచ్చందగినది. భావసౌష్ఠవమునకుం దోడు భాషాపటిమయు నుండుటవలన నీమె కవిత్వము పండితాదరణపాత్ర మగుచున్నది.

ముద్దుపళని తరువాతం బద్యకావ్యములు రచించిన యువతీమణి తరిగొండ వెంకమ్మ. ఈమె చరిత్రము మహా విచిత్రము, అతి పవిత్రము, సంస్తుతిపాత్రము. ఈమె జన్మస్థలము

కడప మండలములోని తరికొండ యను గ్రామము. నందవరీక బ్రాహ్మణ స్త్రీ. ఈమె తల్లి యెవరో తెలియదుగాని తండ్రి మాత్రము కృష్ణయామాత్యుఁడు. ఈమెది వసిష్ఠగోత్రము తన గ్రంథములలో నీమె తన తండ్రి గుణగణములను గోత్రాదికములను బేర్కొన్నదిగాని భర్తనుగూర్చి యిసుమంతైనను జెప్పలేదు. ఇందుచేత నీమె బాలవితంతువని స్పష్టమగుచున్నది. పెండ్లియై యింటిపేరు గోత్రము మున్నగునవి తండ్రికిఁ జెందినవే కాని భర్తకుఁ జెందినవిగావు. పెనిమిటివంశముగాని, పేరుగాని తెలియనంతటి చిన్నతనమునందే యీమెకుఁ బెండ్లియై యుండ వచ్చును. ఈమెను గూర్చి చెప్పఁబడు నొక విచిత్రకథగూడ నిందులకుఁ బ్రబలాధారమగుచున్నది. బ్రౌనుదొరగారు తమ నిఘంటువులో నీమె క్రీ. శ. ౧౭౮౦ ప్రాంతమందు జీవించి యున్నట్లు వ్రాసినారు.

ఏ కారణముచే నయిననేమి యీమె బాలవితంతువనుట నిక్కము. పెనిమిటి గతించినప్పటినుండి యీమె తన పుట్టినయింటనే యుండెను. తండ్రియైన కృష్ణయామాత్యుఁడు మంచి విద్వాంసుఁడగుటఁజేసి భర్తృవిహీనయగు తన పట్టికి మిక్కిలి శ్రద్ధతో విద్యచెప్పి సకలశాస్త్రపరిజ్ఞానము గలిగించెను. వెంకమ్మ సహజముగా శేషాచలవాసుఁడగు (శ్రీ) వేంకటేశ్వర స్వామి భక్తురాలు. ఇట్టి భక్తి తాత్పర్యముచేతనో వైధవ్యముచేతనో యీమె యైహిక వ్యాపారములయందు విరక్తయై వైరాగ్యప్రతిపత్తి నవలంబించి సంతతము భగవన్నామ చింతనముతోను, సద్గ్రంథపఠనముతోను గాలము గడుపఁ

జొన్నెను. ఈమె విధవయైనప్పటికి శిరోజములు తీయించు కొనలేదు. మంచిచీరెలు గట్టుట మానలేదు. భగవంతునకు బాహ్యప్రవృత్తితో బనిలేదనియు గుణమే ప్రధానమనియు నీమె భావించినది. కనుక లౌకికాచారములను గూర్చి యంతగాఁ బాటింపదయ్యె. ఈమెయిట్లుండఁగఁ జూచి యాయూరి బ్రాహ్మణు లాచారవిరుద్ధమని తలవెండ్రుకలు దీయించు నదిగాఁ కృష్ణవేణామాహాత్మ్యకవు నొక్కి చెప్పిరి. అతఁడీ సంగతి పుత్రికతో జెప్ప నామెయు "తండ్రీ! ఈ పలుగాకులు, ఎవరిని మెప్పించగలరు! భగవంతుఁడు ప్రసాదించిన యీ వెండ్రుకలను గొరిగించినందువలన వచ్చుకీర్తియేమి! గొరిగించ కున్న వచ్చునపకీర్తియేమి? మానసిక ప్రవృత్తిమలినము గాన ప్పుడు లౌకికాచారములఁ బాటింపకున్న గృపాళుఁడగు పరాత్పరుఁ డాగ్రహింపఁడు. మలినమైనప్పు డాచారములఁ బాటించినను మన్నింపఁడు కావున నన్నుఁగూర్చి యీ విషయ మును నిర్బంధింపకు" మని పలుక కృష్ణయ్యయుఁ గొమరిత గుణముల నెఱింగినవాఁడు గనుక యేమియు ననక మిన్న కుండెను. తక్కుంగల బ్రాహ్మణు లిది యెఱింగి పవిత్ర చరిత్ర యగు వెంకమ్మను గూర్చి యనుమానించి అంకులాడి యని ప్రకటించుటేగాక తమ యిండ్లకు రానీయమని తండ్రిని, బిడ్డను వెలివెట్టిరి. అప్పటికిని వెంకమ్మ శిరోజములు తీయించు కొనక యీ మూర్ఖులతో నేమని మిన్నకుండెను.

ఇట్లుండ నొకప్పు డాయూరికిఁ బుష్పగిరి పీఠాధిపతు లరుదెంచిరి. అప్పుడు బ్రాహ్మణు లందఱు వెంకమ్మను గూర్చి

స్వామివారికి విన్నవించి మా యింట భిక్షగొనఁ గూడదని వచించిరి. స్వామివారును లౌకికాచారములఁ బాటించు వారు గనుక కృష్ణయామాత్యునిఁబిలిపించి "నీబిడ్డకుఁ దల వెంట్రుకలు తీయింపనిదే మీయింట భిక్షగొనము. మా యాజ్ఞల నుల్లఘింతువేని మిమ్ముల వెలివెట్టినట్లౌతుయిత్తు" మని చెప్పఁగృష్ణయామాత్యుఁడు "స్వామీ! ఇందు నాదోషము లేదు. ఈ విషయమునుగూర్చి నాబిడ్డతోనే ముచ్చటింపు" డని పలికెను. అప్పుడు స్వామివారు వెంకమ్మను బిలిపించి తల వెంట్రుకలు తీయించుకొనవలసినదని నొక్కి చెప్పిరి. వెంకమ్మయుఁ జేతులు జోడించి 'అయ్యా! మీరు జగద్గురువులు. మీకంటె నేను దెలిసినదానఁగాను. అయినను విధవకు శిరోజము లుండకూడదని యే వేదములోఁ జెప్పబఁడినది? ఆమె మానసికప్రవృత్తి యే పరిశుద్ధమైనప్పుడు శిరోజము లున్ననేమి? సొమ్ములు ధరించిన నేమి? మఱియు భగవత్కృపాతిశయము వలనఁ బుట్టుకతోనే లభించిన యా వెంట్రుకలను గొరిగించినంత మాత్రమునఁ దిరిగి మొలవకుండునా? మొలవకుండఁ జేయు సామర్థ్యము మీకు గలదేని యిప్పుడు గొరిగింపుఁడు. భగవంతుఁడిచ్చిన యామైశ్వర్యమును భగవంతునికే యర్పింతును గాని మూఢులగు నీ బ్రాహ్మణుల కర్పింప"నని ఖండితముగా బలుక, స్వామివా రాగ్రహించి 'నీవు మాకుబోధించుదానవా? బ్రాహ్మణసంఘములో నున్నంత వఱకు నీవు బ్రాహ్మణాచారములను బాటింపవలెను. నీ కిష్టములేకున్నను బలవంతముగా నైన గొరిగింతు' మని పలికి యప్పుడే మంగలివానిని రప్పించి

యామె శిరోజములను దీయించిరి. కాని క్షురకర్మ పూర్తి యగు నప్పటి కామె శిరోజములు యథాప్రకారముగా నుండెను. ఇదేమి చిత్రమని మఱియొకమాఱు గొరిగింప నప్పటి యట్లుండెను. అదిచూచి యచ్చటి బ్రాహ్మణులేగాక స్వామి వారును మహాశ్చర్యపడి యేమియుఁ జేయజాలక దిక్కులు చూడఁ జొచ్చిరి. అప్పుడు వెంకమ్మ యథా ప్రకారముగా గొప్పముడిచి "స్వామీ! లౌకికాచారమే ప్రధానమో పరిశుద్ధమైన మానసిక ప్రవృత్తియే ప్రధానమో యిప్పటికైన నిర్ణయింపుడు. శ్రీ వేంకటేశ్వరుని యైశ్వర్యమైన యీ కేశ జాలమును హరింప మీరెవ్వరు ? నా శరీరముతోఁ బాటవియు నా దేవునకుఁ జెందవలసినవే" యని వచింప స్వామి వారా మెనుమహాభక్తురాలని తెలిసికొని యకారణముగా నామెయెడ నిందారోపణ మొనర్చినందులకు బ్రాహ్మణుల మందలించి క్షమాపణ గోరిరి. బ్రాహ్మణులును బుద్ధిగలిగి యామె పాద ములపైఁ బడి తమ తప్పు మన్నించుఁడని ప్రార్థించిరి. ఇట్లు సచ్ఛీలయని యెల్లరచే నుతింపబడినప్పటినుండి వెంకమ్మ తన జీవిత శేషమును గ్రంథరచనకు వినియోగించెను. ఈమెరచించిన గ్రంథములు. 1. రాజయోగసారము (ద్విపద), 2. వేంకటా చలమాహాత్మ్యము, 3. భాగవతము (ద్విపద). ప్రస్తుతము మొదటిరెండు గ్రంథములు మాత్రమే ప్రచారములోనున్నవి. మూఁడవదియగు ద్విపద భాగవతమిప్పు డెచ్చటనుగానరాదు.

ఈమె కవిత్వము కులాంగనా కవిత్వమువలెనుండునుగాని ముద్దుపళని కవిత్వములోవలెఁ బచ్చి పచ్చి వర్ణనలతో నిండి

యుండదు. మఱియు నీమె గ్రంథములందంతగా శృంగార రసము గానరాదు. ఉన్న కొన్ని పద్యములును స్వవిరచితములు గాక శ్రీకృష్ణప్రోక్తములేయని యామె చెప్పినది. ప్రబంధకవుల మార్గముననే యీమె యనుసరించినప్పటికి జటిలపదసమాసభూయిష్ఠమగు వారి శైలినిమాత్రము ననుసరింపలేదు. సులభమగు శైలితోనే వాడుకయందున్న పదములతోనే యీమె గ్రంథములను రచించెను. అయినను భావగాంభీర్యము కొఱవడుటలేదు. మృదుత్వము సన్నగిల్లుటలేదు. స్త్రీ స్వభావసుగుణములగు తలంపులు దూరమగుటయులేదు. స్త్రీలలో నిట్టి కవిత్వము చెప్పుట మెచ్చుకోఁదగిన విషయము. ద్విపదరచనలో కూడ నీమె తన శక్తిని ప్రదర్శించినది. మరియు నీమె రచించిన రాజయోగసారములో నీమెకుఁగల ప్రపంచానుభవము, మానవ ప్రకృతి జిత్రించునేర్పు తాత్కాలిక యైహికవిషయములందుగల వైముఖ్యము, వైరాగ్య ప్రవృత్తి, వేదాంత పరిజ్ఞానము మున్నగునవి తేటతెల్లముగా జూపఁబడినవి. మొత్తముమీఁద దరిగొండ వెంకమ్మ స్త్రీ మండలికి వన్నె ఘటించిన యుత్తమ కాంత.

సమాప్తము.